మ. వినుమున్నీవల దాల్భ్యుఁడన్ముని వినీ వేశ్మంబునన్నాకముం
డీనదద్దొక్కథ రామరోత్తమునకీ డెందంబునం దెంచియా
పనిచేయంగను వేశ్మ సేయుకతనం బాపంబునై కొన్నిటై
ఘనకష్టంబులు వొందుచుంటి విదిపాత్రిక్కర్త్యార్జితంబౌఁగదా. 107

కం. మున్ని వొనరించినయ, త్యున్నతతపమునను నేఁటి కొక్కయుపాయం
బున్నేర్చికొనఁగఁగూడెను, దన్నియతింజనుము బుణము తలఁగిముదమగుఁగా. 108

చ. అలరుమలాపహారినది యయ్యదిపావనికృష్ణఁగూడెనా
స్థలమునసంగమేశ్వరుఁడు, తాస్వయముద్భవలింగమూర్తియై
వెలయుఁదదంబుమజ్జనము వెంటనెయీశ్వరదర్శనంబునుం
గలుగనకల్మషత్వమగుఁగానముతత్ప్రితిముజ్జగంబులన్. 109

ఉ. ఎందఱోమౌనులాఁగతిని యెందఱోవిప్రులు రాడ్విడగ్రజు
ల్వందలు వేలు పూర్వకృత పాపములెన్ని యొపాములొన్నఁగాఁ
గొందలమందుచిట్టెచని గోటనుమీటిపునీతులైరినీ
వందులకేగుమాపయిమ హామహిమాఢ్యతనీకుఁగల్గునాన్. 110

మ. వినసేనక్కరయంబునంబలువిడే న్వేచీవిరాజన్నదీ
వనమధ్యంబునమున్ని లేవనపుడే పాత్రిచీనదాల్భ్యోక్తృతిం
గనియేన్వంగమనాథపూజనమునం గాంక్షించుమనవ్వన్నిరూ
డెనుదత్తీర్థమునాఁటఁగోలెడనను త్రీవింబ్రశంసింత్రిలన్. 111

చ. ఇలువదియొక్కమాఱుధర ణీశ్వరులం దెగటార్చుపాపమా
పరశువునాక్రమింపఁగొని భార్గవరాముఁడుతిన్నివారణం
బరయుచుమౌనిసత్తమస హాయుఁడుతానయిసహ్యభూమిభృ
త్పరిసరమందుఁజేరికనెఁ బావనియైనమలాపహారిణిన్. 11²

కం. ఘనమదియునికనియనుదిన, మునుమునిగణములునుదాను మునుకలిడుచుఁబో
వనుబోవనద్దికృష్ణా, ఘనవాహినిఁగలియునెలవు గానంబడియెన్. 113

మ. కననేపాంగికృతార్థతంబడయనా కాంక్షన్మహాభక్తితో
మునిసంఘంబులతోడఁదన్మహిమమా మోదంబుగాఁజెప్పుచు
న్మనుఁగందోడనెవెల్వడెంబరశువున్మన్నంటియున్నట్టియా
ఘనపాపంబతిఘోరరూపమునవే గంబక్కనద్దిట్టులన్. 114

కం. మలహారికృష్ణఁగూడిన, స్థలమిదియమృతాబ్ధియనఘ సమితికిదావా
నలమగుమాదృశులకునిఁక, నెలవొసఁగుమునిలువఁజాలఁ జెచ్చెరఁజనెదన్. 115

మ. అనుచేఁగంగినుఁగొన్న మౌనివరుల త్యాశ్చర్యముం బొందఁగా
ఘనుఁడా భార్గవుఁ డిష్టసిద్ధి యగుటం గావించి దానంబులా
స్థనుబూజించెను క్షేత్రనాయక శివుం దానట్టులర్పింపమిం
దనపున్నెంబు సగంబు వాయుననునీ తంబప్డు బోధించుచున్. 116

కం. ఇది సద్యోజాతగుహా, మదేవతత్పురుషములవి మఱియు నఘోరం
బదెయదెయీశానమునని, విదితంబులు సేసె లింగ వితతి మునులకున్. 117

తే-గీ. అల్ల లింగంబులం గొల్చి తొల్లి యేను, ముక్తులై నారొతక్కథా సూక్తులొలి
నెఱుక పఱచుచుఁ జనియమ్ము తేశలింగ, మూర్తిఁగని వెల్లడించెఁద త్కీర్తినిట్లు.

సీ. ఏడతోలోకంబు లెప్పుడు ధరియించుఁ, దేజోమయుండన దీప్తుఁడగుచు
మున్ను దధీచియా పన్నుఁడై సేవించి, వజ్రకాయుండయి వఱలె దాన
వేలుపులా తని వెన్నెమ్ము యాచించి, వజ్రాయుధముఁ జేసి వైరివీర
వరులను బరిమార్చి పరగె దరంతకు, మూలమే యీలింగ మూర్తి సుండి

తే-గీ. హరివిధులు గూడఁ దెలియలేరైరి మహిమ, భక్తులకభీష్టసిద్ధి చూపట్టునిటనె
యనుచు రాముఁడు దృఢమతి వినుతిసేయ, మునులు సేవించి రమ్మ తేశుమనములలర.

తే-గీ. మరలి రాముండు మలహరి దరికిఁ జేరి, లింగమొనరించి పూజించి లేపనూన
నిశ్చలంబుగఁ దానట నిలుతుననుచుఁ, బలికె నదికూడఁ జూడ రంజిలెడు నేఁడు. 120

కం. పలు తెఱఁగుల భార్గవుఁడా, మలహారిణి కలియు నెలవు మహిమం బెంచుం
దెలిసి యుధిష్ఠిరముఖ్యులు, సలలితులై రిక దయటకుఁ జనినందున నే. 121

సీ. ఇఁక నుతుక్లైరావ తకుబేర దారిద్ర్య, మోచనలింగేంద్ర ములనఁ బడెడి
యాఱు రామేశమ యూరగోకర్మతు, యాదు లేడునుబది మీఁదమూఁడు
పలకుతీర్థములు స వ్యాపసవ్యంబుగా, మునుఁగఁ బాపమువాపి ముక్తి కలుగు
తెలియు జాతిస్మర తీర్థంబు నందొక్క, నెలమజ్జనంబాడఁ దొలిభవంబు

తే-గీ. కలవు దేవప్రహాదమునన ఘప్రహాదములు, వాలఖిల్యులకును మున్న వనజనూతి
తెలిపె నావంత సుకృతంబు సలుప నాడ, మేరువంతౌ నసందగు తీరదెల్ల. 122

సీ. పదివేలయేడులు బదరికాశ్రమమునఁ, దప మొనర్చు ఫలంబు దగ్నసమున
రహిస్నానమున శతరాజసూయాశ్వమే, ధఫలంబు దేవప్రహ దంబొసంగు
వేయశ్వమేధము ల్సేయ నౌ సుకృతంబ, దనఘుహ్రదస్నాన మునఁ గలిగెడి
మధ్యరాత్రి నమర్త్య మహితదుందుభిమ్రోత, వినఁబడునట నెప్డు విశదముగను

తే-గీ. సత్యసుమమత్స్యముఖతీర్థ సమితి యొప్పు, నచ్చటనె మున్ను మోహిని యైమురారి
సురలకసురులకమృతంబు చోద్యముగను, బంచి ధృతి మించెదై త్యులు వంచితులుగ

ఉ. దీనినిఁదాఁటఁ సప్తమునితీర్థముకద్దఁటవానలచ్చటం
బూనితపంబుచేయుటను బొందెఁదదాహ్వయమద్దిదానిలో
స్నానమొనర్చు మర్త్యులకు సంచితపాపములెల్లఁబాసి యుత్త
జ్ఞానముకల్గుమిక్కుటము గాసదసత్తులెఱుంగనౌటకై. 124

ఉ. గాధికుమారుఁడొక్కయెడఁ గట్టడిగాఁదపమాచరించియా
రాధనసేయఁగృష్ణనిజ రమ్యసురూపముతోడనిల్చిసం
బోధనచేసియిట్టులనెఁ బొందితిమోదమునీదునిష్ఠకో
సాధుమునీవరంబడుగు చయ్యననామునిసన్ముఁడై వెసన్. 125

శా. ఓహోపావని విష్ణురూపిణిమహా యోగీంద్రహృద్వాసినీ
సాహంకారుఁడ మత్తుఁడజ్ఞుఁడనీ సాన్నిధ్యముంజేరివ్యా
మోహంబుల్విడనాడి తింగరుణతో ముక్తింబ్రసాదింపుమీ
దేహంబస్థిరమం చెఱింగితిసమా ధింగృష్ణవేణీశ్వరీ. 126

శా. నిత్యానిత్యపదార్థవేత్తలగుమత్తా నీంద్రుల్సుపర్వాణులు
న్భృత్యుల్కయియుండినందునఁగదా పేరొందిజీవించురా
దైత్యుల్మర్త్యులునిన్నుభక్తిఁగొలువ స్థస్వత్వముంగాంత్రజ
స్తుత్యాలోకముఁబ్రోవనీవెగతిపా సూకృష్ణవేణీశ్వరీ. 127

శా. స్వాంతంబందిసుమంతరేఁగరుణయు న్యాచంబులేకున్నదు
ర్భ్రాంతులాత్మనవులజ్ఞాలంచెదదయ న్భావించివీంద్రండనా
వంతలాత్మనిచిసుంతసంబిడఁగ పృష్ఠుండుహర్షించినీ
చెంతన్నిల్వసహాయుఁడై కుదురవచ్చెంగృష్ణవేణీశ్వరీ. 128

కం. అనుగాధేయునివినుతికిఁ, దనిసివగంబిచ్చికృష్ణ తద్విధముగనే
మనుజుఁడుస్తవమొనరించినఁ, గనుముక్తినటంచుఁబలికెఁ గలదటమీఁదన్. 129

తే-గీ. భీమరథిసంగమంబుబల్ప్రీతితోడ, సంగమేశ్వరలింగమె సంగుచుండు
స్నానమటఁజేసితనపూజ సలిపినంత, మంగళంబులుపలుమఱో సంగుచుండు. 130

చ. లవణనిశాచరుండనెడి లావరిపర్వతరూపధారియై
యవధియొకింతయేవిడక యడ్డముగానదిఁబడ్డఁగృష్ణయా
విపరమెఱుంగఁజేయనల వెన్నుఁడువానివధించెనానదిం
దవులనెపావనుండగుటఁ దప్పెఱుఁగందగిమొక్కియిట్లనెన్ 131

శా. హీనుల్దుష్టులు మాద్యశుల్మనములో నెగ్గించిసద్ధర్మసం
ధానంబెట్లొఘటించి తేజ్వఁగనునీ తాత్పర్యమత్యద్భుతం
బానోహోజననీ సుఖార్థఘటినీ యామోదసంధాయినీ
నానాలోక సుపూజ్యమానచుసమా నాకృష్ణవేణీశ్వరీ. 132

ఉ. చేసితి దప్పనీకరుణఁ జెందితి మేలిఁగఁజత్తుఁగా డయా
భాసురదీర్ఘ రాజమునఁ బల్కుచునన్నె ఋఁగంగఁజేసితో
నాసయొకండుకద్దటుల నమ్మరొయిమ్మవకాశమన్న నా
దాసుని పేరనయ్యదిస దాపిలువంబడనయ్యెనచ్చటన్.

ఆ. మజ్జనంబుసేసి మధుసూదనునిఁగొల్వ, సకలపాపములను సమయఁబిదప
వేదపాదగిరిని వెడలియే తెంచెడి, తుంగభద్రకృష్ణ సంగమించె. 133

ఉ. అంచితభక్తినాడఁగమ లాపనుఁడొక్కఁడ పేడ్కఁదాఁబ్రతి
ష్ఠించెనులింగమూర్తినిన జేశ్వరలిఁగసమాఖ్య నొప్పెడిం
గాంచిభజించులోకులకుఁ గల్గుని చైహిక సౌఖ్యమెంతొ పై
నెంచినసత్యలోకమున స్వేచ్ఛఁజరించు విశేషసౌఖ్యముల్. 134

కం. దానిసలంపురియందురు, దానికిఁబిమ్మటనులింగ తటములరారు
న్నానారూపంబులఁదాఁ, గానంబడుగిరిశుఁడచట ఘనముదిసుండీ. 135

కం. అనినూతుఁడువలుకంగా, వినుమునులుప్పొంగికృష్ణ వేణియటుపయిం
జనినతెఱంగటఁగింపవె, యనుపమముగురోక్తులొలుక ననఁ దెల్పెమనూ. 136

పుష్పమాలికా బంధచంపకమాల.

సురవరవారపాలబల శూలమునన్న సమానవాంతకుల్
తరతరముల్వియుక్తముద తన్నతమైతలఁగన్యగఁ లైగన్
బిరబిరచేరఁగోరుదురు నీరుచినమ్మినదీన సేవకుల్
వరువడియిద్ధియిత్తెయిడ వచ్చువరావళివాస్తవాశివా 137

కందగీత గర్భితోత్పలమాల.

శ్రీ, నగజేశనీ, మఱుఁగుఁ జేర్వఁగఁగోరియ మందభక్తి బల్
ధ్యానములన్;సదా, నెఱపఁ దన్నియమంబుగ ణింపనేల న
య్యా! నగుమోమొగిం, గననె హా,యిగనుండఁగఁ గల్గఁగాదె యీ
శానశివాపతీ, గిరిశ చక్కనిప్రీతిసు ఖింపనిమ్మయా. 138

కం. నగజేశనీమఱుఁగుఁజే, ర్వఁగఁగోరియమందభక్తి బల్ధ్యానముల
న్నగుమోమొగింగననెహా, యిగనుండఁగఁగల్గఁగాదె యీశానశివా

తే-గీ. మఱుఁగుఁజేర్వఁగఁగోరియ మందభక్తి, నెఱపఁదన్నియమంబుగ ణింపనేల
కననెహాయిగనుండఁగఁ గల్గఁగాదె, గిరిశచక్కనిప్రీతిసు ఖింపనిమ్మ.

కందము. శ్రీదక్షిణాస్యకరుణాసాదిత కవితావిలాసి చతురతవార్సెన్
నా దెళ్ల పూరుషోత్తముఁడాదటఁ గృష్ణకథ రెండవాశ్వాస మిటుల్.

---

# కృష్ణానదీమాహాత్మ్యము.

## తృతీయాశ్వాసము.

కం. శ్రీరామేశ్వరబాణా, సారసభూముఖ్యవిబుధ సమితిత్రాణా
భూరినగేంద్రధనుర్ధా రీరమ్యవిలాసయువధ రింపఁగదయ్యా. 1

ఉ. ఓలినికృష్ణవేణిదన నున్నతశృంగవిరాజమానదే
వాలయసత్కిరీటముమ హాదశఁజూటుచునుండెనొప్పశ్రీ
శైలనగాధిరాజమును|జయ్యనఁగన్గొనినిల్వనప్పుడే
వాలియదెట్టులేగెడినొ యన్నభయంబునఁజిక్కియిట్లనున్. 2

మ. జననీనీకునసాఖ్యమెప్పుడిసెయీ సందేహమేలోకదా
కనముద్దైవిలసిల్లునెట్టులనువ క్కల్లేయనౌనందువో
అసవారేతినలంకరించినటుల ద్దైయింకముద్దైతగు
న్ఘనమప్పింతకుమీఱుసాఁగుమిఁకవే గంగృష్ణవేణీశ్వరీ. 3

మ. తగుశ్రీశైలము క్షేత్రవర్యమనఁగా ధాత్రీస్థలిన్వన్నికుం
దగుదేవుండిట మల్లికార్జునుఁడుభే దంబూడ్చిమోదంబిడం
దగదేతీర్థవరేణ్యమీ వగుటనీ ధామంబునందుండనో
జగదామోదిని యీకొనంగదవెయి చ్చంగృష్ణవేణీశ్వరీ. 4

మ. మలసంహారిణిసంగమంబతులమౌ మాహాత్మ్యముంగన్నదై
యలరుంగానియదుండుదూరమునన, మ్మాయట్టిదొండిచ్చటం
గలుగంజేయుముదీనమానవమహా ఘంబుల్నివారించునీ
తలఁపీడేరెడియుక్తకార్యమిదికా దాకృష్ణవేణీశ్వరీ. 5

కం. అనియమరులడిగికొనవిని, ఘనశక్తిందన్నగంబుఁగదులోతునకుం
దునియఁగవిజియఁగ్రయ్యఁగ, నొనరించిపాతాళమంటి యొయ్యనఁబోలెన్. 6

తే-గీ. కానదానికిఁబాతాళ గంగయనెడు, పేరుపెట్టిరిదేవత ల్ప్రీతిఁబొగడి
అల్లదసమానతీర్థమై యలరుజగతి, మల్లికార్జునదేవుని,మహిమమెండు. 7

కం. భ్రమరాంబికాసమేతుఁడు, కమనీయవిలాసమూర్తి గారంజిల్లుం
దమమదినేరదికోరిన, నమరుచుఁదద్భక్తికొలఁది ననవరతంబున్. 8

ఆ. ఇద్ది తెలియనైన యితిహాసమొక్కటి, ముద్దుగులుకునట్టి సుద్ది కలది
కద్దువినుఁడుదానఁ గనియెదరా దేవుఁ డెద్ది కోరనైన నిచ్చుననుచు. 9

చ. కలదొకయగ్రహారముసుఖావహమైనప్రదేశమందునం
దలరెడిబ్రాహ్మణోత్తముల యర్భకులొక్కెడఁగూడియాడికోఁ
బలికెనొకండుముందుఁగల పండువునాఁటికిస్వీయసోదరీ
తిలకముబావనుంబిలిచి తెచ్చెగఁదాననిబింకమేర్పడన్. 10

చ. అదివినివేఱొకండటులె యన్యుఁడునంతటనింకనొక్కఁడా
యదనుననాడనాడికొను నందఱునుందముయక్కబావల
న్ముదముననఁబిల్చితెత్తుమను ముచ్చటఁబల్కఁగ రాముఁడన్నవాఁ
డదివినివారియట్లెతన యక్కనుబావనుదెత్తునంచనెన్. 11

ఆ. వానికక్కలేదు బావయులేఁడద్ది, యెఱుఁగలేనియంత చిఱుతబుడుత
యగుటదీటుపలుక ననియునుజట్లాగెఁ, గానినిజమెఱుంగు కడమవాండ్రు. 12

శా. ఓరీ దేబెబిరానవాగితివెయే యూరీవుపో నేర్తునీ
కేరీయక్కలుబావలింతతిసినీ వీయూఁకనేయేడ్తుకా
కౌరామావలెముద్దుముచ్చటలునీ కౌనొక్కసన్నాసివే
పోరాయంచునుమొట్టిరందఱపుడే పోనైరివారిండ్లకున్. 13

తే-గీ. రాముఁడబలుండునొంటరి యైమఱేమి, చేయలేకనిక్కనాపాట్లు చెందియేడ్చు
చిల్లుచేరియుఁదల్లితో నెల్లఁదెలిపి, యక్కబావలకై వెక్కి వెక్కియేడ్వ. 14

ఉ. ఆజనయిత్రి పేదటిక మందునుసాధ్విసుశీలయంచు నా
నాజనపాళివల్కఁగవి నమ్రతయేఘనభూషణంబుకాఁ
గాఁజరియించుఁగానసుతు కష్టమునోరిచియున్న లోపమే
యోజనొమాటుపుత్రమను నూహనుజెందిబిరానబిడ్డనిన్. 15

ఆ. ఎత్తికొంచుఁగన్ను లొత్తియూరార్చినా, యన్నయేడ్తువేర యక్కబావ
నీకులేరె? పిచ్చి లోకులెఱుంగక, యన్నదేమిమనకు వన్నెచెడునె?. 16

మ. అననేయేడుపుమానితద్వివరము. యాత్రిన్విననంగోరఁద
జ్ఞానీరత్నముబావఁ బెట్టుచునుశ్రీ శైలంబునందుందురో
తనయానీకగునక్కబావలననే, తన్నామముల్వాంఛతో
వినియుప్పొంగుచుఁబవ్వళించెనతికా వింపన్నిజార్థంబులన్. 17

ఉ. ఎప్పుడొరేయిలేచితన యిచ్చకువచ్చిన యట్టులేగనా
చొప్పదియాశుఁడేయెఱుఁగుఁ జూడక వేకువఁదల్లి లేచితా

నెప్పటియట్టులాపనియు నీపనియుంబొనరించికొంచునో
క్కప్పటికప్పరయేఁడనుచు నారయుచుంజనెవీథివీథికిన్. 18

ఆ. ఇల్లునిల్లుఁజొచ్చెఁదల్లడించుచుఁజూచె, నూతులందులోతు గోతులందుఁ
బ్రక్కనొప్పనైన పల్లెలమందల, వెదకెఁబొదలయందు విసిగియేడ్చె. 19

ఉ. దిక్కొకసైనలేనిసుద తీమణినందనుపోషణంబెపె
ద్దక్కఱగానఁదీఱికర వంతయులేకచరించునట్టిద
ట్లొక్కడనేడ్చుచుంబడిన నూరఁగలట్టితెలాదకీమణు
ల్దిక్కయిలేవనెత్తిమరలించిరియెట్లులొచావకుండఁగన్. 20

శా. ఆరేయర్భకుఁడూరుతావిడిచియ త్యంతప్రయత్నంబుతో
దూరస్థంబగునూరొకండుకనిచే తోమోద మొప్పారఁగాఁ
జేరంబోయిజనాళిఁగాంచియడిగె న్శ్రీశైలమిద్దాయటం
చోరీకుఱ్ఱఁడయేలనాఁ దెలిపెన్వే యోత్సాహమొక్కుమ్మడిన్. 21

కం. కనముద్దొబిడ్డనినుడి, వినముద్దైనిలిచివాని వెనుకకుఁబనుపం
గనుఁగడఁగివాఁడటొప్పమి, మునుమార్గముచూపిరన్న మునుబెట్టియటన్. 22

ఉ. రేలఁబవళ్లనిట్లనుస రించినమార్గము వీడకేగుచుం
జాలముదంబెనెమ్మదిని సంధిలనాటనుత్తుత్తుబాధకుం
దూలఁడుదప్పినెన్నఁడెదఁ దోఁపఁగనీఁడితరంబునేదియు
న్వాలకుఁడెట్టకేలకల పర్వతరాజముఁగాంచెఁజేరువన్. 23

చ. నడచినమార్గమందెటజ నంబెకసంబడకుండిచూడన
ట్టడవులబెబ్బులుల్చిఱుత లల్లవృకంబులు భల్లుకంబులే
ర్పడినభీతినొందఁడవి రాయిడిసేయునటంచెయెన్నమి
న్జడుపెయెఱుంగఁడింతయును స్వాంతమునంగలచింతపెంపునన్. 24

కం. ఆయటువిదుష్టమృగతతి, పాయంజనివాఁడుతమ్ము బాధింపనివాఁ
డైయుంటఁదెలిసిస్వేచ్ఛను, బోయెన్బుడుతండుత్రోవఁ బోవంబోవన్. 25

మ. కనుఁగొన్నట్టి ధరాధరేంద్రమునఁదాఁ గాల్మోపియొక్కంగనం
దునువ్యాఘ్రాదులనేక ముల్కనఁగనా దూరంబిఁకెంతేగిన
న్జనులున్వారిగృహంబులుం బురములు న్జాడైనలేవప్డత
న్మనమెట్లుండెనో ధైర్యమెట్లుతగినీ మంబింకఁదానిల్చెనో. 26

మ. అరయంజిత్రమదొఁగదాగహనమం దన్వేషణోత్సాహియై
తిరుగంబర్వతశృంగ మధ్యమునదే దీప్యాలయంబుంగనె

న్మఱిసె నోసోదరి బావఁ గన్నటుల నే ముందద్ది నల్దిక్కులం
బరిశీలించి యుద్వారమందుఁ దగిసం భావించెబావన్వడిన్. 27

ఆ. బావఁ బిలిచిపిలిచి పలుకమినంతట, నక్కఁ బిలువఁ జొచ్చె మక్కువపడి
ఆమె పలుకకున్న నారసె హేతువ, ద్వైలుఁగుగుఱుతుపట్టె నెఱుగరటని. 28

ఉ. కావునఁ బేరులం బిలువఁ గావలెనంచని మల్లికార్జునా!
బావ! యెఱుంగవే మొననుఁ బాపఁడ నీదుమఱందినయ్యరా
నీవయలోనికంచనియు నేమమ! యో భ్రమరాంబయక్కయా!
త్రోవనుడస్సివచ్చితినిస్తోడనుబుట్టినవాఁడ రాముఁడన్. 29

ఉ. బావయెఱుంగకుండునన వచ్చునతండితరుండుగావున
న్నీవటు లెట్టులౌదువమ నీ వెనుకంటజనించినాతనిం
గావఁగరావదేమిటికిఁ, గాఱడవిస్పలుకస్తినొందుదుం
గావలెనంచువచ్చితిని గాదటెతమ్ముఁడనెత్తికోవటే. 30

కం. బావా తగునా నీకిది, నావలె నాయాసమంది నందెలిసెడిఁ బో
వావులువరుసలు నేఁడా, రావయ్యా తలుపు తెఱచి రక్షింపంగాన్. 31

తే-గీ. ఎంతపిలిచినఁ బలుకరీ వింతయేమి, బావకే మైనఁ జెవుడున్న భ్రమరకున్నె
కాకయీ వేళ నిద్రింత్రె కదలిరాని, కారణంబేమిబిగ్గర గాఁ బిలిచెద. 32

కం. ఓహోమల్లయబావా!, ఓహో భ్రమరాంబయక్క యొక వేళకున
న్నూహింపరె వియ్యంకుఁడ, సాహసమున మీకొఱకునె చనుదెంచితి నే. 33

ఆ. పిలిచిపిలిచిమిగుల విలపించివిలపించి, మరలఁ బిలిచి మూర్ఛ నొరిగి తెలిసి
పట్టరాని దుఃఖభరమున నేర్పడ్డ, భక్తిచేతననియె బావఁ గూర్చి. 34

శా. బావామల్లయ మల్లికార్జునుఁడ సంభావింతు నిన్నే కదా
నావారెరిట లేని యర్భకుఁడఁ గా నన్నావె నాదీనతం
దోవం జూపుమఁ దోడు నీడవగుచు న్దుఃఖంబు వారించుచుం
బోవన్దేవుఁడవౌచు నిల్వఁగదవే పుణ్యంబు నీకబ్బెడిన్. 55

శా. మావార ల్తగుకట్న మీ మిననుస మ్మానింపకున్నా వెయో
బావా పేదటికం బెఱుంగవయయో బంధుత్వముం బాపుదే
యావైనంబులు నాకు నేలవినుమ య్యా మిమ్ముఁ గొంపోయి నే
దేవుంగొల్చెడిరీతిఁ గొల్తు విడుసం దేహంబు, నన్నేగ్ర వే. 36

కం. దేవుండవై నీవే, బావవు నాకైన నీవె పలువురుమఱుదు
ల్నీ వెంటఁ బడరొ కండనె, సేవింపఁగ వచ్చియుంటిఁ జేరుపుమంటిన్. 37

తే-గీ. నిన్ను నిత్యముమాయక్క కన్నమిన్న, బత్తిఁగాళ్లొత్తుచుందునీ చిత్తమలర
నెన్నియోనాదుమనమున నున్నవకట, తలుపెతీయవెపిలిచినఁ బలుకవేమని. 38

శా. ఆక్కాతమ్ముఁడ దిక్కుమాలియిటనే నార్తిన్మొఱల్వెట్టినా
దిక్కేచూడవె యెంతగట్టిమనసే దీనార్భకుండంచు న
మ్మక్కల్మార్గమునందుఁ జేరిమఁగనిరా మాత్రంబులేదాయెనా
లెక్కేమంచను బావకోపముడుప న్లేవాననుంబ్రోవవా? 39

కం. ఒడసారమొక్కతమ్ముఁడఁ, గడునిడుమలఁబడుచుఁజేరి కరమర్థింతు
న్నడుగులఁదెలియంబడదే, నడవడిచొప్పెలనన్ను నమ్మవెయక్కా. 40

ఆ. ఎన్నినాళ్లొయాయె నింతయన్నమతిని, నీరమైనఁదారిచ నేరనైతిఁ
బైఁగనఱచియఱచి బడలితిఁజొక్కితి, నకటచావురాదె యాసపోదె. 41

చ. అనుచనిచేతపాతిఁగొని యక్కనుబావనిఁగొంటఁబిల్చివా
రనుమతిసేయమింగినిసి హస్తమునెత్తియుపాలితోడనె
త్తినిబడమోదికొంచునువ్వు లింబడయంగమకింపనంతలోఁ
వినఁబడెఁదల్పుచప్పుడది విస్మయమందిమఱందికానఁగన్. 42

సీ. దినవాధకోటిదే దీప్యమానాకార, సుందరుండుగిరీంద్ర మందిరుండు
రాజరాజజ్జటా భాసితస్వర్గాపగా, నీరదుఁడనుగత నారదుండు
హరిశిరోమణితర శోభితమౌక్తిక, మాలికుండుభువన పాలకుండు
పార్శ్వగతాత్మీయ భామామణీభ్రమ, రాంబికుండుజనార్ద నాంబకుండు

తే-గీ. శమితశమనుండుగజదైత్య శాసనుండు, మానివరదుండుహరివిధి మానితుండు
తత్క్షణంబునవెల్వడి తక్కఁగమును, బట్టికొనియిట్టులనియెను బావవరుస. 43

కం. ఇదెకదనీబింకంబే, పదనునఁదగునొకనంగఁ బలుకకయున్న
న్నొదలంటఁదెలిసెమఱఁదీ, బెదరింతువెవీరముష్టి బిచ్చపులెక్కన్. 44

తే-గీ. అనుచు శివుఁడసభ్రమరాంబయనుఁగుఁదమ్ము, నెత్తికొనిముద్దులన్మించియెన్న రాని
రైకమత్యముఁజూపుచు నమ్మసేమ, మరసెలోనికిఁగొంపోయి రప్పుడలని. 45

చ. అదియిదివాఁడుసెప్పవిని హర్షపయోనిధివాఁడుమున్గున
ట్లొదవెడిలాగుసంబలుకు చొక్కఁటబావయిఁగొంటనక్కయుం
గుదిరియటొప్పసేవకులఁ గూరిచివిందొనరించియుండఁగా
నదనదియంచువాఁడడిగె నక్కనుబావనురండటంచువే. 46

ఉ. ఏటికిఁబోవనచ్చటికి నీదకెయమ్మనుబిల్వనంపియా
ఫీటనెయుంచమంచనిశి వీథునొకోతనపట్టురాముఁడా

మాటకుసమ్మతింపకొక మాఱటులేగినవెన్క మీరలే
పాటులఁబెట్టినంబడుదుఁ బంధువునాఁటికెపోదమంచనెన్. 47

ఆ. వానిపట్టుదలను వదలకఁబ్రతిమాలి, కాలవేళ్లఁబడఁగ జాలినొంది
శూలియాలితోడ నాలోచనమొనర్చి, బయలుదేఱరూఢి పఱచినంత. 48

ఉ. పట్టఁగరానిమోదమున భావుకపాదుకలన్భుజంబునం
బెట్టియుఁగొన్నవస్తుతతిఁ జేరిచికూరిచియెత్తఁబోవఁగాఁ
బుట్టినకూరిమిన్నహజు ముద్దులుగొంచపుడక్కయెత్తికో
నట్టెబిరాననిల్వెడలి రందఱుబాలకుఁడుల్లసిల్లఁగన్. 49

కం. కనుమూసి తెఱచులోపల, ఘనపథమదికడవఁబడియెఁ గానంబడియెం
దనయిల్లురామునకున, మ్మనుబిలిచెనువేగరాఁగఁ బాద్యముఁదేఁగన్. 50

ఉ. వానినిబాసితజ్జనని వారునువీరెవరేమిచెప్పిన
న్నానెనుదిండియొప్పదుకు మారునిఁగూరిచియేడ్చుచుండెఁదా
వానికలస్వరంబువిని వచ్చితటాలునఁదల్పుతీయఁగాఁ
గానఁగనై రిబిడ్డఁడును గల్గినకూతురునల్లుఁడొక్కెడన్. 51

కం. కలయఁదియనినమ్మకక, న్నులునులుముకొనంగనంద నుఁడువడిగాలో
పలికేగిజలముఁగొనిపద, ములుబావకునక్కకపుడు ముదమునఁగడుగన్. 52

ఆ. పెట్టిరడుగులోనఁ బెద్దపీటలమర్చి, కూరుచుండఁజేసి తీరికఁగని
వెల్లవోయియున్న తల్లితో శ్రీశైల, మనవె తెలివివచ్చెఁ గనులువిచ్చె. 53

మ. కనఁగాఁగల్గెఁ బురాణదంపతులలో కత్రాణపారీణుల
స్వనజాక్షాంబుజసూతి ముఖ్యవిబుధ వ్రాతార్తివిధ్వంసుల
న్మునినాథామల హృత్పయోజగతచి న్మోదాచ్ఛసన్మూర్తులం
దనబ్రోవైం దమవియ్యమంచుమనువం దన్వచ్చియున్నారలన్. 54

ఆ. చచ్చిపుట్టినట్టు వచ్చినతనబిడ్డ, మాటయైనఁదలఁప మానితమ్మ
విపులభక్తినరయ నపరిమితానంద, భరితులగుచుఁబనులు జరిపిరపుడు. 55

కం. అలయిల్లెహర్మ్యమయ్యెను, వెలసెనుధనధాన్యపదవి వెలలేనిసగ
ల్భలసిరిపరిజనములుకల, కలమనుచునుగనఁ దోడఁగిరి కలవారెల్లన్. 56

చ. సకలచరాచరంబులవె సన్నుతిఁజేయించి భరించుచుండియు
న్నికలముచేయుపోఁడకది వింతయెగారడివానిమాద్రిబా
లకునిముదంబుపెంపునకె రమ్యతరంబగునట్టుచూపినా
టకమునుబోదుమింకనవి డన్మనసొప్పనిబాలుఁడిట్లనున్. 57

కం. ఇటనేమీరుండుటయో, యటకేపోవలయునన్న నమ్మన్ననుఁ జెం
గటఁ గొంచుంబోవుటో కా, కిట మేముటమీరలుంట యిఁక సాఁగదినే 58

తే-గీ. చెప్పకేగినవిడనంచుఁ జెప్పనేల, వెంట నేవత్తుఁ గాదెమీ యింటికడకు
అమ్మ మనలనువిడనాడ నడలుఁ గాదె, అక్క మదినోవదే బావ యరయుమీవ. 59

చ. అనవిని యట్లులై నమనస్తమందఱు మేగుదమంచు మల్లికా
ర్జునుఁడనునంతలో వెలసె శోభిలు దివ్యవిమానయుగ్మ మం
దుననొక దానబావమఱొకదు లెన్నెఱదానను దల్లి కూతులె
క్కి నవవిహాయి డిగ్గెఁ బరికింపఁగ రౌప్యధరాధరంబునన్. 60

ఆ. అట్టిమఱదిబోట్లె పట్టినపంతముఁ, జెట్టియట్టిపనుల నిట్టొనర్చె
మాఘభక్తులనె మురిపెము మెండల్ల, మల్లికార్జునునికి వెల్లడియిది. 61

ఉ. శ్రీగిరిమల్లికార్జునుని చిత్రచరిత్రము లెన్నియో తగు
న్బాగుగఁ గృష్ణవేణియట భాసిలుటంగనవచ్చె భాస్కరుం
డాగిరిపుత్రిచండికయు నాడనెవారలనిల్వెఁ గృష్ణమే
లీఁగను చంద్రులోకులకుఁ గృష్ణయు నర్కుఁడు చండికాభవుల్. 62

ఉ. ఎన్నఁగరాని సంఖ్యనచ్చలేశ్వరతీర్థము ముందులెక్కగా
నున్నవిస్నాతలందఱికి నుత్తమలోకనివాసమిచ్చుచిం
కెన్నఁగ ముక్తితీర్థమని యెన్నికఁగన్నదికద్దుసత్వసం
పన్నులుఁ వకానులచ్చటను బల్వురుముక్తినిబొందిరారయన్. 63

కం. నరసింహతీర్థమనఁగాఁ, బరగు న్వేదాద్రికరయఁ బశ్చిమమందు
న్హరికనకకశిపుఁ ద్రుంచిన, పరితాపము వాపికొనఁగ వచ్చెనటకు మున్. 64

ఆ. ఉత్తమప్రదేశ ముత్తరవాహిని, ఎండదచటనీర మెన్నఁటికిని
పిండదానమాడఁ బితరులకొసఁగిన, నరకమడుగు నూఱు తరములకును. 65

మ. హరిణావర్తకతీర్థ మొప్పెడిఁ బ్రవాహంబందు మున్నొక్కఁట
న్హరిణంబుల్ మృగయాభయార్తిసదినా హోయంచు మున్గంగనా
హరిణత్వంబెడఁబాసి దివ్యతనుగ వ్యాకారముల్బూనియా
సురలోకంబునకేగెఁ జూపఱకుబ లోచ్చేద్యంబు వాటిల్లఁగన్. 66

తే-గీ. అవ్విగ్రుంకినచోటని ప్డలరుసుడి, అందుస్నానంబొనర్చిన నందుముక్తి
పాపనాశనతీర్థంబు పరగుఁ బొంత, స్మరణమాత్రంబుననె పాప సమతిఁ బాపు. 67

చ. కలదమరేశతీర్థమనఁ గానొకఁడంతటఁ దన్మహత్వముం
బలుకఁగలారలుండెదరె పార్థితుఁడై భవుఁడల్ల పేరితో

వెలసినచోటఁదానచట వేలకొలందిమహర్షులింద్రము
ఖ్యులుసురలుందపంబునకుఁ గోరివసింత్రుకృతార్థులౌటకై. 68

తే-గీ. పరగఁబ్రణవేశపార్థివేశ్వరులనంగ, మఱియగస్త్యేశకోసలేశ్వరులనంగ
నింకసోమేశ్వరుండను నేనుతెలుఁగు, లందిశివుఁడుప్రసన్నుఁడై యలరునందు. 69

కం. స్నానముజపముఁదపంబును, దానముశ్రాద్ధంబుఁజేయు ధర్మాత్ములకుం
దానిచ్చుఁగోటిగుణితము, గానగుఫలమీశ్వరుండు కడుమోదమునన్. 70

తే-గీ. సర్వపర్వంబులందటస్నాతుఁడగుచు, నమరనాథునిసేవించు నట్టిజనుఁడు
మాతృగర్భమెచొరఁడుదా మహిజనింప, నచటిమృతిశివసాయుజ్య మందఁజేయు.

తే-గీ. భైరవునిగణపతివిఘ్నభర్తఁ గాంచి, మాతృకల చండికేశ్వరు మహితదుర్గ
సోమనాథునినందీశుఁజూచిమ్రొక్కి, యమరదేవుని గొలుచుటేయగుఁగ్రమవిధి

కం. ఎదియెవఁడెదఁగోరిననది, పదయుండమరేశ్వరుండు పరగుననొసఁగుం
గదతత్తీర్థమెయసమము, మదిఁదస్నానంబునెన్న మాయునఘంబుల్. 73

తే-గీ. అరయసహ్యాద్రిమొదలుశ్రీ, గిరివఱకును, గృష్ణభాగీరథీసమ యఁకనబ్ధిఁ
గలియుదనుకనుబోయిన కొలఁదినెన్న, ఫలమునూఱంతలింకేమి పలుకవలయు

తే-గీ. కృష్ణఁదగునీరుఁద్రావుట కెనయగుసుమి, గయనొనర్చెడిశ్రాద్ధపు గౌరవమ్ము
నమితదానముకురుజాంగలమునవీగి, బ్రహ్మమెఱుఁగంగనౌ తెల్వి పడయుమన్కి.

కం. ఏపాపియేదఁజచ్చిన, నోపికనుదదస్థులైన నుంచినఁగృష్ణం
బాపెడిఁదత్పాపంబులు, నీపాటిమహత్త్వవిందు మేభువిలోనన్. 76

ఆ. అమరతీర్థమునకు నలరెడిఁదూర్పున, గ్రౌంచతీర్థమందుఁ గలఁడుభైర
వుండుదానికడనె యుండును త్రిక్షేత్ర, మసమఫలమునిచ్చు ననవరతము. 77

చ. కలదటనంతతీర్థమును ఖంబుగనక్కమలాధరిత్రులం
గలిసిజనార్దనుండుసుము ఖత్వమునందివసించుచుండుఁద
త్థ్సలమునఁగిన్నరాదులుము దంబుననుంద్రిసుమంతయేనియే
ఫలమొసరింపనైననది భవ్యమనంతసుఖప్రదంబగున్. 78

శా. ఆలీలందగు కృష్ణవేణికనెము న్నావచ్చుమార్గంబులో
సాలాగ్రాంచిత మేఘమండలముభాస్వద్దివ్యనవ్యోషధీ
జాలంబున్మదితాంతరంగవిలసత్సత్త్వాభిరామంబునౌ
కీలాహార్యమవార్యధైర్యమనిశం కించెన్వెసన్డాయఁగన్. 79

మ. కనిరష్టయ్యాది వెంటవచ్చుసురసంఘంబింద్రకీలాద్రితో
ఘనకృష్ణామహిమంబును ద్యమము వేగం జెప్పిదారీయఁగా

ననునే శైలవరేణ్య మీయకొనిమ ధ్యంబందు రంధ్రంబు గా
నొనరించెన్నది గాంచి దేవతలుగ న్మోదోత్సాహ మొప్పింపఁగన్. 80

శా. తల్లీ లోకముఁ బ్రోచు సత్కరుణచే తన్నీవు వెల్వడ్డయే
తల్లీలాకృతిఁ గాంచి యెవ్వఁడిలమీఁ దన్నీకు సన్డంబు కోఁ
జెల్లుం బోవినినంత వేగముచే సెన్మార్గమీ వేగరం
జిల్లన్ స్వేచ్ఛను బాటి చేరువనరాశిం గృష్ణవేణీశ్వరీ. 81

శా. పుట్టింగంటి విపశ్చమాచలము పైఁ బూర్వావనీభృత్తుపై
మెట్టిం జూచినయట్టులీ వడుగులం బెట్టంగనీయద్రిలో
తట్టెల్లంగను పట్టుఁగా దెజగమం తన్నీవు వ్యాపింపనై
నట్టేతోఁచెడిఁ జూపఁ జెల్లరకున మ్మాంకృష్ణవేణీశ్వరీ. 82

శా. నీ తేజోద్భవునిల్లునీ నెలవుగా నీవుంటికొన్నాళ్లు కా
దారమ్యాకృతిఁదాల్చి నీవిటుల మోదంబందియే తెంచుట
న్నీ రాశింగననైననే తగుఁగదా నీపెంపు సాంసారనా
తీరేయుక్తమదద్రి దాటనగుళకీర్తిం గృష్ణవేణీశ్వరీ. 83

మ. హరిపీఠాద్రి నెఱుంగు మేముకనునీ యాంతర్యమీక్షింపనా
హరినారీమణి పుట్టినిల్లగుటచే నత్తిల్లగున్నీకునా
హరిపుత్రీమణి యట్టెచేరఁజనుదీ వంభోధికింగాననీ
ధరణీభృత్తుఁదరింప వేగపడుమింతం గృష్ణవేణీశ్వరీ. 84

మ. ఘనమౌనీజవమెంచి నన్వేనుకనీ కార్యంబులీక్షించినం
జననీ వెంచిన నిన్ను నడ్డుకొననే శైలంబులే లెక్కయ
ట్లును గాకీకొని మార్గమిచ్చినదిగ ట్టున్నాటిసాఁగంగదే
జననీ సర్వచరాచరావనయథేచ్ఛం గృష్ణవేణీశ్వరీ. 85

మ. అని దేవావళి సన్నుతింపవినిప్రహ్లాదంబు రెట్టించి పా
వనవీచీప్రతతుల్మహారవముతో భాసిల్ల నొక్కమ్మడి
న్జననయ్యేటునఁ దోరపుందుసుకలై శైలంబు తచ్ఛక్తి పెం
పునఁ గ్రోశద్వయదూరమందుఁబడియెం బోజూపటాహోయనన్. 86

చ. సలలితదివ్యవైభవవిశాలవికాసతిరస్కృతార్కమం
డలయయి దుర్గతన్నగము నన్విలసిల్లఁగ మల్లికార్జునుం
డలరు ముదంబుతో వెలసి యచ్చటఁదమ్ము భజించునట్టిభ
క్తులకును వాంఛితంబులొసఁగుం దుదిన్వియసమీపమిచ్చెడిన్. 87

మ. సురలోకప్రభుఁడు వేడికోనసురసంక్షోభంబువారించెభ
సురనానాయుధపాణియౌచునవిఁదా శోభించిదుర్గాంబత
ద్గిరిపై నేర్పడినట్టియానగరముం గీర్తించిరద్దెల్లరు
న్గులుతోప్పన్జయవాటియంచుగిరిజం గూర్మింబ్రశంసించుచున్. 88

ఉ. పాండవమధ్యముండుబహు భక్తినొనర్చుతపంబు మెచ్చి వే
దండయముండుబోయయయి తద్భుజశక్తిఁబరీక్షచేసియు
న్నండును జెల్లఁ నావిజయ నామమునస్త్రమునిచ్చెనీడనే
పండితవేద్యమైవిజయవాటిక నానొక పేరిటేర్పడెన్. 89

చ. జలములనోషధుల్గొనుచుఁ జయ్యననీనదియేగుదేరఁగా
మొలచెనవ్రదిఁబట్టుకొని ముందుగవిత్తనమీనఁగల్గుటం
గలిగెనుబీజవాటియనఁ గావొక నామముదీనఁజేసియీ
స్థలముమహత్త్వఁజెప్పుటకు సాధ్యమెధాతకు భోగినేతకున్. 90

చ. వలసినరుండుతావిజయవాటిక రేవునస్నానదానము
ల్కలిగినయట్లొనర్చిగిరి కన్యకదుర్గ భజింపనైననే
కొలఁదియఘంబులైనవెసఁ గూలునుగాలినిదూలఁగాలుఁబో
కలుగదువానివంశమునఁ గష్టమునష్టము స్పష్టమిద్దిలన్ 91

సీ. కననచ్చటఁగలఫల్గునదుర్గశూలకే, క్షేంద్రదర్శితీర్థంబు లందుమునిఁగి
ఆదినిదాదుర్గ మాసురుభంజించి, మహిషదైత్యునొకప్డు మడిపిపుచ్చి
శుంభాదిరాక్షసోజ్జృంభణంబునడంచి, సర్వదామేల్చేయు జగముతల్లి
ఫల్గుననను మెచ్చి పాశుపతంబిచ్చు, ఫల్గునాఖ్యేశ్వరు భక్తిఁగొలువ

ఆ. మఱియుఁబ్రహ్మచక్ర గరుడకూర్మస్కంద, శంభుతీర్థములను స్నాతుఁడైన
సర్వజన్మదురిత సంక్షయంబై దివ్య, పదనివాసమబ్బుఁ గదనరునికి. 92

కం. అమరెడినటులుపైఁగనుఁగొన, రమణీయంబైనయుభయతీరామేశ్వరతీ
ర్థముదానిపుట్టువరయనె, సమరహితమదంచుఁదెలియు జనులెల్లరకున్. 93

శా. శ్రీరంజిల్లుధరాస్థలిన్విజయలక్ష్మీవాసమోనానయో
ధ్యారాట్స్థానము భాస్కరాన్వయవిభూత్తంసాళిపాలించిరా
సారాచారులశ్రేష్ఠుఁడౌదశరథ క్ష్మాభృత్తుకోర్కెంగనె
శ్రీరామప్రభులక్ష్మణున్భరతునిన్జెన్నారశత్రుఘ్ను నిన్. 94

మ. ధగనప్పుండినదైత్యబాధనుడుపం దన్నబ్జభూముఖ్యని
ర్జరులార్తిన్వినుతించి కోరికొనశ్రీ రాముఁడుగాఁబుట్టెశ్రీ)

ధరుఁడే కావున బాల్యమే మొదలుత ద్దైత్యాళిసంహారమే
పరమార్థంబుగఁజేసి భూప్రజకు సౌభాగ్యంబుఁదాఁగూర్చెన్. 95

ఉ. చిన్నతనంబునందుఁదమ చెన్నుఁగనుంగొనుతండ్రిఁగోరిర
మ్మన్నను గాధిపుత్త్రివెను కంటిచనందమతోఁ బ్రకడ్డమై
యున్న నిశాటిఁ దాటక మహోత్సుకతం బరిమార్చి సౌఖ్యసం
పన్నులఁజేసె రాముఁడుత పస్వులనార్జితసత్ఫలస్వులన్. 96

ఉ. అంతట గాధిసూతిప్రబ లాస్త్రచయంబు లొసంగివారలం
జెంతలనిల్పి యాగమువి శేషముదంబునఁ జేయుచుండ మ
ర్త్యాంతకులౌ సుబాహుముఖులల్లరిచేయఁగఁగాంచి రాఘవుం
డంతకు ప్రోలికింబనిచె నయ్యసురప్రతతిన్మహోద్ధతిన్. 97

మ. మఱియొక్కమ్మునఁ దోలెదవ్వునకు నమ్మారీచు నిన్నీచుని
న్వరుసన్సర్వ సురారులిట్లడఁగ విశ్వామిత్రుఁ డయ్యాగమూం
బరిపూర్ణంబుగఁజేసి, రాఘవులసంభావించి దీవించియు
న్మరుమేల్సేయఁగడంగి యారయఁగనె న్మార్గంబు కార్యార్థమై 98

శా. వారున్మానియుఁ బోవుచుండఁగనుద్రో వన్గౌతమాఖ్యర్షి రా
ణ్ణారీరత్న మహల్య రాయి యయియు న్నన్భర్తృ వాక్యంబున
శ్రీరామాంఘ్రి సరోజమా శిలపయిం, జేరంగ నే పూర్వయో
షారూపంబుధరించె రామమహిమన్సారం బెఱుంగంబడన్. 99

చ. చనిరటు మీఁదటన్మిథిల జాటఁగఁబడ్డ స్వయంవరంబాగిం
గనుఁగొననాడనున్న హర కార్ముక మేపతులెత్తలేకపో
యినది రాముఁడిట్టెకొని యెక్కిడనొక్కనె పెక్కుముక్కలై
తునిఁగెనటున్న వారతని తోరపుబీరపుఁ బారమారయన్ 100

ఉ. సీతను రామచంద్రుఁడును శేషసహోదరు లాత్మపుత్రిక
న్భ్రాతృ కుమారులన్వివాహముఁజేసికొనంగయుక్తమం
చీతెఱఁగొప్ప నాదశరథేశుఁడటంచును బిల్వఁబుచ్చియు
న్ప్రీతిఁ దలిర్పనాజనక భూపతిచేసె సమస్తకార్యముల్ 101

కం. ఆతటిఁ బెండిలియాడెను, భూతలపతి రామవిభుఁడు భూమిజాత
న్సీతన్సద్గుణభాగ్యన్, పేతన్భవనైకమాతఁ బ్రీతంబూతన్. 102

ఉ. బాగుగఁ గార్యముల్జరిగె వారలయోధ్యకుఁ బోవసాఁగఁగా
వేగమె భార్గవుం డెదిరి వింతగ రాముస్వ నాముదూఱుచుం

దాఁగుటె పెట్టుమంచుఁదన ధర్మమొసంగజవంబు దాననే
లోఁగొనెఁ దద్విధంబుఁగని, లోపమెఱింగి యెఱింగిపాయుడున్. 103

మ. జనకుండు న్జననుల్ప్రధానిముఖులు । న్నామంత రాజాళియు
న్ఘనసంప్రీతిని ముద్దులన్మఱియుఁగాఁ గైవారముల్సేయఁగా
వినుతింపంగను సోదరుల్సతియుఁదా విస్తార సౌఖ్యంబుతో
డనుసాకేతపురంబునం దలరుచుం డంగొన్ని యేండ్లేగినన్ 104

ఉ. పట్టముఁగట్ట రామునకుఁ బంక్తిరథుం డెదఁగోరి యత్నము
ల్పట్టుగఁజేయఁ గైకవిని భర్తనుదొంటి వరమ్ములిమ్మనం
గట్టడిపుట్టె రామునకు గానన । వాసమొసర్పనప్డుతోఁ
బుట్టిన లక్ష్మణుండుసతి భూమిజయుందన వెంటసాఁగఁగన్ 105

శా. నందిగ్రామమునందు నున్న భరతు । న్శత్రుఘ్ను రావింపఁగా
నందున్భ్రాతలవేగ దుఃఖవశుఁడై యాతండ్రి యీల్గంగనా
చందంబుంగని యౌర్ధ్వదైహికవిధు ల్సాఁగించి శ్రీరాముఁడే
ఱుందామందఱుఁ గూడియేగనటమార్గంబందుఁ జిత్రంబుగాన్. 106

మ. అలరామున్వనభూమికంపి భరతుం । డాయన్నతోఁ బోరఁగా
బలముంగొంచన్నదెంచునంచుమదిలో భావించి శ్రీరామార్థమై
తలఁచెందానని సేయఁగాగుహుఁడుత ద్ధర్మంబెద న్మెచ్చియ
బ్బలహీనున్శరణంబు వేడితెలిపె న్భావంబతండీకొనన్. 107

ఉ. రామునిఁ జిత్రకూటకుధ రస్థునిఁగన్గొని మ్రొక్కి తెల్పిన
న్భూమివరేణ్యు మారకము పూన్కిఁ గ్రియల్పొనరించెనంతనా
స్వామిని రమ్మటంచడుగఁ బాదుకలిచ్చి మగల్చె భ్రాతలం
దామిలుసేరి పెల్లరును । దమ్ముఁడుభార్యయుఁ దానటుండఁగన్. 108

చ. అడవులరామభద్రుఁడుజ్జటాజినము ల్ధరియించిమౌనిమైఁ
బడఁతియుఁ దానుదమ్ముఁడుఁద పస్వులఁ గన్గొనియాదరించివా
రిడనగునాతి థేయముల నెంతయుఁ బ్రీతినిఁగొంచుఁగానలోఁ
గడపుచుఁ గాలమంతటను గానఁగ నేగెను దండకావనిన్. 109

మ. కననావింతలఁ గూర్చిచెప్పికొనుచుం గాంతార మార్గంబున
న్జననాథుండు సహోదరుండుసతివో సాఁగన్వెస న్నిమ్నగామా
ర్గనిరోధుండయి వారిఁబట్టికొను ఘోరాకారుఁగ్రూరున్విరా
ధనిశాటుంబరిమార్చి మొక్కెచనెగం ధర్వత్వమప్డేర్పడన్. 110

మ. నిదురింపన్భుజియింప మానియెపుడు న్నిష్ఠందముం గొల్చునా
సదయుం డమ్మని లక్ష్మణార్యుఁ గనుచు న్సంప్రీతి గోదావరీ
నదిఁ జేరన్ ధరిఁ బర్ణశాలనివసిం పం గాంచి రొక్కప్డనా
మ్మదినాడంగల పండులేరికొనినీ మం బొప్పభక్షించుచున్. 111

మ. అకలంకుండగు లక్ష్మణున్మనులుమా యంజొన్పి చేయింపఁ జం
బుకుమారుండను కైతవర్షి మడియ న్సోమసంబుఁ జింతింపఁ గా
సుకరంబద్దని దైత్యుఁడా మునియటం చుం దెల్పియూరార్చి బా
ధకముం బాపితటంచు మెచ్చికొనిరా ధన్యాత్ము ధర్మాత్మునిన్. 112

చ. అలమునిజల్లి శూర్పణఖ యచ్చటఁ జచ్చిన పుత్త్రిఁ గాంచి చం
చలమతియై యటిట్టరుగ న్సాగుడుఁ జేరువఁ బర్ణశాలలోఁ
బలఁగలదివ్యవిగ్రహుల భ్రాంతలఁ గన్గొని భ్రాంతిఁ గోరనా
తులువను ముక్కుఁ గోసియటు తోలెను లక్ష్మణుఁ డద్దిపోయియరున్. 113

చ. వెసఖరదూషణత్రిశిర వీరముఖాళిఁ బదాలు వేవురం
బసగలమేటి కాంస్యరథ పంక్తుల వెల్వడుయోధవీరుల
న్దెసల ద్రువంగఁ బంపెఁ దన దివ్యమహామహిమంబు శోభిల
న్గసిమసగించె రాఘవుఁడు కానఁగ లేఁడసురుండు కాననాన్. 114

చ. ఇదికనఁ జుప్పనాతికిఁక నేద్భుభరింపఁగ రానిదయ్యెబ్యాలం
కఁదసరు రావణాసురునిఁ గాముకశేఖరునన్నఁ గాంచి రా
ట్సుదతిని దొంగిలింపుమని చొన్పెను గార్యమునందుఁ గావునం
గదలెనతం డెటెంగియును ష్టగాలము చేరువనుంట భ్రాంతిచేన్. 115

శా. మారీచుండను రామవైరిఁ గొనిరా మాయామృగం బౌచువాఁ
డారామాంగన మ్రోలనాడ సతిమోహం బందికోరంగఁ దేఁ
గా రాముండు కడంగియేగియునశక్యం బౌటన మ్మాయన
య్యా రేల్లక్ష్మణ సీతయంచుఁ బెనుదేహం బందివాఁడీలిగన్. 116

మ. అలకేకల్విని సీతరామునకపాయం బయ్యెనం చెంచిని
శ్చలునిన్ లక్ష్మణుఁ గానకాడిపనుప న్సౌమిత్రిపోఁ గా వణుం
డలయుం బోడిని దొంగిలించికొనిపో నధ్వంబునం దడ్డిత
న్నలయింపంగను నాజటాయువును మా యంగూల్చిపోయెన్వడిన్, 117

చ. మరలినరాముఁడయ్యనుజు మార్గమునం గని యిల్లుసేరి సుం
దరినటఁ గోసి వేసరి వ్యథంబడిపోవుచు మార్గమందుఁ గాం

చిరవిహగేశుఁడద్దెలుక । చేసియతండసువుల్త్యజింపఁగా
జరిపిరటుత్తరక్రియలు సమ్మతిగాఁ బితృమైత్రి నెంచుచున్. 118

చ. కననయి రావణాపకృతి కాఁగల కార్యముఁ గోరియేగుచో
వనమునఁదమ్ముఁ బట్టుకొని వాంఛను బ్రమింగఁగఁడంగు నాకబం
ధునిఁదునుమాడఁ దాలిచెను దోడనె దివ్యసురూపమాతఁడు
న్వినుతులొనర్చిపోవఁగను వీరును జేరిరిపంపచేరువన్. 119

ఉ. ఆయెడనున్న వారలను హాబలపుత్త్రుఁడు కాంచి మొక్కియా
ధీయుతుఁడర్కసూతికలకిఁ ధీరులకున్నతఁ గూర్చెసీతము
న్వేయఁగఁగొన్న సొమ్ములటఁ బెట్టిరి రాముఁడు వారలెల్ల నా
ప్యాయమునొందఁ గూల్చెనొక బాణము నేసియె సప్తతాళముల్. 120

ఉ. పావనుఁడైన రాఘవుని ప్రాపిటులందిన బల్మిఁగల్గుసు
గ్రీవుఁడు వాలిఁ బోరునకుఁ బిలిపియతండరు దేరఁ బోరరా
మావనినాథుఁడొక్కశరమాతనిపైఁ బడ నేసికూల్చిసు
గ్రీవునిఁ గీశరాజ్యము భరింపనొనర్చెనతండు పంపఁగన్. 121

మ. పలుదిక్కుల్వరికింప వానరులు వోవంగేసరీపుత్త్రము
ఖ్యులు సంపాతి యెఱుంగఁ జేయవినిగమ్యోత్సాహమొప్పన్మహా
బలసూతిం బురికొల్పవార్ధిదుమికెం బ్రాగల్భ్యమీక్షింపవే
ల్పులు పుత్తెంచిన సింహికం గడచియుం బోకార్చిలంకాబలన్. 122

శా. లంకావీథులఁ గ్రాలు సౌధముల నెల్లం గాంచియుఁ దోప్పనా
పొంకం బారసి మెచ్చికొంచు నటుపోఁ బోఁగానశోకాశ్రయం
బంకేజాక్షిని రాక్షసీపరివృతన్ భర్త్రంఘ్రికంజాళిని
శ్శంకంగన్గొని యాంజనేయుఁ డెడఁద స్వాంతోపమముం బొందియున్. 123

ఉ. సాగిలి యుంగరంబొసఁగి స్వామికథల్వినిపించి సీతయా
బాగగు నానవాలుఁగొని । బంటుతనంబటఁ జూపఁ గోరి వే
లాగెను జెట్టులందెలిసి లావరియక్షకుమారుఁడెత్తిరా
వేగమ యెల్లరన్యముని వీటికిఁ బంపెను । బాటవంబునన్. 124

చ. అలిగిసురారియింద్రజిన టంపఁగ వానికిఁ జిక్కిపోయియా
తులువను నోవనాడి తనతోఁకను గాల్పఁగఁ గడంగదాననే
మలమలమాడ్చె లంకగరి మంబుసగంబడు గంటనంతనా
లలనకు మొక్కి మారుతిబలంబున వారిధి దాటియేగియున్. 125

మ. తనవారిన్ జతగూర్చి కొంచరిగి సీతం గన్న వృత్తాంతమా
జననాథుం డెఱుఁగంగఁ జేయనపుడే సైన్యంబులం జేర్చికొం
చునుయుద్ధంబునకేగనై రచటసం శుద్ధాత్ముఁడౌ నావిభీ
షణుఁడన్న న్వలదన్నఁ దన్న నృపస త్సఖ్యార్థియై రాఁగనెన్. 126

ఉ. రాముఁడుఁ గూర్మిఁ జేర్చికొని రావణసోదరు సేతుబంధనం
బామహిమాఢ్యవానరవ రాళియొనర్పఁ బయోధిదాఁటియుం
బో మొదటం బ్రభాకరసు పుత్త్రుఁడు రావణుతోడఁ బోరవాఁ
డా మెయినున్న యక్లైతెఁగి యారయనందన మందరోషుఁడై. 127

చ. పదపడి రావణాసురుని బంధులుమంత్రులు పుత్త్రులాప్తులుం
గదలిదురంబుఁ జేయఁగనఁ గానొకరొక్కరివంతు! కాఁగనే
మొదలిడియెల్లరన్నమర భూమికినీబలి రావణుండిఁక
న్నెదరియుఁ గుంభకర్ణునిగ[illegible]భీరుని నిద్దురలేపి పంపినన్. 128

శా. గంభీరధ్వనితో మహాద్రినిభమౌ గాత్రంబుతో వెల్వడెన్
జృంభించెన్ జడిపించెముంచెగదలం జేబల్మిచేవైచియ
య్యంభోరాశిగభీర రాముఁడెదురై యమ్మొక్కఁ డేయంగనా
జంభారాతి హతాచలంబనఁగర త్నస్సేనలాగ్వంబడెన్. 129

శా. మాయల్నేర్చి వరంబులందియెదురే మాత్రంబులేకుండిని
ర్జేయుండంచుఁ ద్రిలోకముల్వొగడఁ గాఁ జెన్నొందనానింద్రజి
త్తాయుద్ధంబునఁ జూపినట్టి ప్రభవం బయ్యారెయేరెన్ననాఁ
బోయెన్లక్ష్మణహ స్తముక్తశరమే పున్నామపనిర్జీవుఁడై. 130

ఉ. రావణముక్తశక్తిఁ బడె లక్ష్మణుఁడాత్రిని రాముఁడుండఁగాఁ
బావని వేగఁ బోయితన బాహుబలంబు రయంబునెన్నసం
జీవినిఁ దెచ్చి జీవితునిఁ జేసెను లక్ష్మణు రాముఁడప్పుసం
భావనచేసియాహనుమఁ బ్రాణసమానుఁగ నాత్మనెన్నఁగన్. 131

మ. సురనాథుండను పంగనై నరథముం జోద్యంబుగానెక్కి వా
నరనాథుండుఁ దదాప్తులుంబొగడ నానందంబమందంబుగా
నరనాథుండు విభీషణోక్తవిధి బాణంబేయ నాభీకరా
సురనాథుండటఁ [illegible]గూలె ధాతృముఖసంస్తోత్రంబుల న్దేన్పడెన్. 132

చ. నిలిపె విభీషణున్ దితిజనేతగ నచ్చట నిష్కళంకఁగాఁ
దెలియఁగ నిల్పిచేకొనియె దీప్తశిఖానలమందు జానకి

స్థలముల గూడి రాఘవుఁడు వారిధిదాటనె బ్రహ్మహత్యనా
మలినముఁబాపికొనిలిపె మస్తభుజంగము రామలింగముల్. 133

సీ. సంపూర్ణజయమంది సాకేతపురికిని, బుష్పకారూఢుఁడై పోవునపుడు
శ్రీరామచంద్రుఁడీ చెలఁగుకృష్ణానది, నీచోటఁదాటుచు నిద్దియసమ
మనివినయైనట్టి యార్యోక్తినిటడిగ్గి, స్నాతుఁడై పూతుఁడై సకలజనులఁ
దరియింపఁజేయఁగా నిరుపార్శ్వములయందు, రామలింగేశ్వరు రహినిలిపియు

తే-గీ. తాను సేవించితనవలె నేనరుండు, నదిమునింగిమహేశ్వరు నెదభజింప
నైననిహపరసౌఖ్యంబు లందివఁశ, రంజనుండగుననిపల్కె రామవిభుఁడు. 134

కం. రామార్చితలింగములభి, రామములై యున్నయుభయ రామేశ్వరము
ల్తామేరు కానఁగల్గుదు, రామనుజులు రామవరము నందఁగలరిటన్. 135

ఆ. అనుదుఁడెలుపురామ హర్షణిపల్కుల, కమితహర్షమంది యల్లమునులు
మున్నుకృష్ణయేగు తెన్నెల్లఁదెల్పవే, యన్నఁబొంగియిట్లు లనియెదేవ. 136

ఖడ్గబంధ కందము.

ధీరసురవారశుభకర, వారణరజనీచరేంద్ర వారకసాధా
ధారాధరగమనభయని, వారణమౌనీంద్రబోధ పావనగాధా. 137

చిత్రపదద్విపద చంపకోత్పలమాలానేకవిధకందరగడముఖ్య,
బహుపద్యశత గర్భితభాస్కర విలసితవృత్తరాజము.

కోరెదగురువరకూరిమిగూర్పన్, గుందఁగఁగొఱఁతలు గుఱుతునఁగూడన్
చేరెదఁజిరతరచేరువఁజేర్పన్ జెందఁగసిరులను జిరమరఁజిమ్మన్
తేరెదస్థిరముగఁదీరికఁదీర్పన్ దెందముతిరమవు తెఱఁగునుగొల్పన్
మారెదస్మరహరమారుతమార్పన్ మందముమరుగవు మరులునునిల్పన్. 138

చిత్ర పదములు.

పాసలు పెక్కుప్రదేశములందున్నందున సులభముగావీలయిననన్ని యేరవచ్చును.

ద్వి ప ద లు.

కోరెదగురువర కూరిమిగూర్ప, చేరెదఁజిరతర చేరువఁజేర్ప
తేరెదస్థిరముగఁ దీరికఁదీర్ప, మారెదస్మరహర మారుతమార్ప
గురువరకోరెదఁ గూరిమిఁగూర్ప, చిరతరచేరెదఁ జేరువఁజేర్ప
స్థిరముగఁదీరెద దీరికఁదీర్ప, స్మరహరమారెద మారుతమార్ప
కుందఁగఁగొఱఁతలు గుఱుతునఁగూడు, చెందఁగసిరులను జిరమరజిమ్మ
డెందముతిరమవుఁ దెఱఁగునుగొల్పు, మందముమరుగవు మరులనునిల్పు
కొఱఁతలుకుందఁగ గుఱుతునగూడు, సిరులను జెందఁగఁ జిరమరజిమ్మ

తిరమవుదెందముఁ దెఱఁగునుగొల్వ, మరుగవుమందము మరులునునిల్వ ఇవన్నియు దసరాచాపదులుగాను నానావిధములైన స్త్రీలపాటలు గాను బాడదగియుండునదుండగ్ 'పాహిరామప్రభో' 'హరిహరి హరియిందురార' మున్నగుకీర్తనల పాఠాంతరములుగ సైతముండును.

## చంపకోత్పలమాలలు.

1. గుఱుతునఁ గూడనేకొఱఁత కుందఁగఁగూరిమిఁ గూర్పఁగోరెదన్
జిరముఁ జిమ్మనేసిరులఁ జెందఁగఁజేరువఁజేర్పఁ జేరెదన్
తెఱఁగునుగొల్వనోఁదిరము డెందముఁదీరికఁ దీర్పఁదేరెదన్
మరులునునిల్వనోమరుగు మందముమారుతు మార్పమారెదన్.

2. గురువరకోరెదంగొఱఁత కుందఁగఁగూరిమిఁ గూరుపంగదే
చిరతరచేరెదన్సిరులఁ జెందఁగఁజేరువఁ జేరుపంగదే
స్థిరముగఁదేరెదందిరము డెందముఁదీరికఁ దీరుపంగదే
స్మరహరమారెదన్మరుగు మందముమారుతు మారుపంగదే

ఉ. కోరెదఁగుందఁగాఁగొఱఁతఁ గూరిమిఁగూర్పఁగదే గురూత్తమా
చేరెదఁజెందఁగాసిరులఁ జేరువఁజేర్పఁగదే చిరంతరా
తేరెదడెందమాఁదిరము తీరికఁదీర్పఁగదే స్థిరమ్మగా
మారెదమందమామరుఁగు మారుతుమార్పఁగదే స్మరాపహా.

## అనేక విధకందములు.

1. కోరెదగురువరకూరిమి,కూరుపఁగుందఁగఁగొఱఁతలు గుఱుతునఁగూడన్
జేరెదఁజిరతరచేరువఁ, జేరుపఁజెందఁగసిరులను జిరముఁజిమ్మన్.

2. తేరెదస్థిరముగఁదీరికఁ, దీరుపడెందముతిరమువుఁ దెఱఁగునుగొల్వన్
మారెదస్మరహరమారుతు, మారుపమందముమరుగవు మరులునునిల్వన్.

ఇంకప్రథమపాదము మాత్రము అమర్చిచూపబడును
దానినిబట్టి తక్కినపాదము లేర్పఱచుకొననగుంగదా.

2. గురువరకూరిమిగూరుప, గొఱతలుకుందగగుఱుతున గోరెదగూడన్.
3. కూరిమిగూరుపగురువర, కోరెదకుందగగొఱతలు గుఱుతునగూడన్.
4. కూరుపగూరిమిగురువర, కోరెదగుందగగొఱతలు గుఱుతునగూడన్.
5. కొఱతలుకుందగగూరిమి, గురువరకూరుపగుఱుతున గోరెదగూడన్.
6. గుఱుతునగూడంగోరెద, గురువరకుందగగొఱతలు కూరిమిగూర్పన్.

ఇట్టియేర్పాటునవచ్చు జోళ్లన్నిడజనులు లెక్కకుజిక్కునుగదా.

## రగడల మాదిరులు.

కోరెదగురువర కూరిమిఁగూర్పక్, చేరెదఁజిరతర చేరువఁజేర్పక్
గురువరకూరిమిఁ గూర్పంగోరెదఁ, జిరతరచేరువఁ జేర్పంజేరెద
కూరిమిఁగూర్పం గోరెదగురువర, చేరువఁజేర్పం జేరెదఁజిరతర
కూర్పంగోరెద గురువరకూరిమి, చేర్పంజేరెదఁ జిరతరచేర్పుమి·
గుఱుతునగూడుమి కొఱతలుకుందఁగఁ, జిరమరజిమ్ముమి సిరులనుజెందగ.

ఇట్టుల నున్నవన్నియుంగని పట్టవీలగునుగదా
ముఖ్యాశబ్దాను బంధమునకు సీసపాదములు.

గుఱుతునఁగూడంగఁ గొఱఁతలుకుందంగ, గురువరకోరెదఁ గూర్మిఁగూర్వ
చిరమరఁజిమ్మంగ సిరులనుజెందంగఁ, జిరతరచేరెద జేరఁజేర్వ
తెఱఁగునగొల్వంగఁ దిరమవుదెందము, స్థిరముగఁదేరెదఁ దీరఁదీర్వ
మరులునునిల్వంగ మరుగవుసుందము, స్మరహరమారెద మార్తుమార్వ.

కందము.

శ్రీదక్షిణాస్యకరుణా, సాదితకవితావిలాసి చతురతవాసెక్
సాదళ్ల పూరుషోత్తముఁ, డాదటఁగృష్ణకథ మూడవాశ్వాసమిటుల్.

---

# కృష్ణానదీమాహాత్మ్యము.

## చతుర్థాశ్వాసము.

కం. శ్రీకంజోద్భవమాధర, పాకారిప్రముఖవిబుధ పటలాదరణా
లోకైకశరణ్యాదూ, రీకృతభక్తాఘయవధ రింపఁగదయ్యా. 1

తే.గీ. అమరునటసప్తకోటితీర్థములువరుస, నంతఁదవరారు క్షేత్రమ నంతవరము
సప్తకోటీశ్వరాభిఖ్య సాంబశివుఁడు, తానచేటనిల్చుభక్తసంతాణనిష్ఠ. 2

ఉ. తొల్లియనంతుఁడాగరుడు తోజగడం బొనరించియోడిభీ
తిల్లి మహేశ్వరుంగొలిచి ధీరతచిక్కవరంబు లందిశో
భిల్లినతావదానటల భించెడిపుణ్యమనంత సౌఖ్యసం
పల్లలితంబనందగుశుభంబులఁగూర్చ్చుముదంబు పెంపుగన్. 3

ఉ. లోకమునందునిస్తులఫ లోన్నతిఁగూర్చుచుఁ బోవుచున్నయా
శ్రీకరకృష్ణవేణితన చెంగట శ్రీహరిమల్లికార్జును
ల్భీకరపాపహర్తలయి పేర్మివహించి వసించునట్టిశ్రీ
కాకుళమన్న క్షేత్రమును గల్పనచేసె మహోత్తమంబుగాన్. 4

సీ. ఆనదిన్ స్నానంబు నాచరించినరుండు, క్రమముగానొనరుదానములుచేసి
ఏకరాత్రిప్రసన్నైకదీక్షనెసంగు, మల్లికార్జునుఁగొల్చి మహితనిష్ఠఁ
దచ్చివారాధన దారలుందానును, జరుపుశ్రీకాకుళేశ్వరుభజింప
వదలునఘంబులు మదికోర్కెలభియించు, సదమలపదవియె సాధ్యమగును

తే-గీ. పాపనాశనతీర్థమ ప్రభనుగాంచు, మభయసోమేశతీర్థంబు నున్నదంతఁ
గోటిఫలియను పేరను గూడఁదనరు, దీనమునివరులిష్టసిద్ధినిగనుటను. 5

కం. నరకోత్తారణతీర్థము, పరగుంజేరువనటున్న పశుపతిపృథివీ
శ్వరుఁడతనిఁగొలువనైనం, దరియింతురి యేడ యేడు తరములవారల్. 6

చ. కలదిఁకశుక్లతీర్థమనఁ గామహిమోన్నతిఁగన్నదౌందుశ
త్థ్యలమునకల్ల నామముపొసంగిన కారణమెన్నఁగృష్ణయే
ఫలములొసంగఁగల్గెడినొ పాపములెట్టులఁ బాపఁగల్గునో
కలదికలట్టు తేలెడిని గానవినుండది తెల్పఁ బూనెదన్. 7

మ. ఒకయూరున్నదిదాన బ్రాహ్మణులు ధర్మోత్సాహులై యింద్రురా
జపురీసుందరణధీరులర్యులు ధనుల్సత్వాఢ్యులాపాదజు
ల్సకరామోదకర ప్రసూనఫలసంశోభాన్వితోద్యానము
ల్వికచాంభోజ విలాసయుక్తసరసుల్వీధుల్తగున్సౌధముల్. 8

శా. ఆయూరన్నివసించు బ్రాహ్మణుఁడొకం డార్యోక్తమార్గంబున
న్శ్రీయుక్తం బలిపాదపద్మమధుపన్దీనార్థికల్పద్రుమ
న్స్వీయాపస్తాన్వయ సంభవంబరిణయస్వీకారఁగాఁబూని తా
నాయెగ్నేస్తుఁడనూన సద్వ్రతముల త్యాస్థంబొనర్పంగనెన్. 9

మ. కనియెందొల్లి కుమారునొక్కనిరతీ ట్కల్పాచ్ఛసౌందర్యవం
తునిధాతోద్రిప మధీయుతున్సుముఖునిత్యోత్సాహునంతంగుమా
రినిలక్ష్మీప్రతి మానమానవతిసం ప్రీతిన్జనంబెల్లరుం
గనసాచక్కనిరూపము గొనముచొక్కంబైనయొక్కర్తుకన్. 10

సీ. పుట్టినబిడ్డల పూర్వకర్మఫలంబొ, వారికేర్పడినట్టి వ్యాధిబలమొ
అలతలిదండ్రుల త్యనురాగవంతులు, సౌఖ్యసంపన్నులు సత్వయుతులు
బిడ్డలనెక్కుడు ప్రేమనాత్మప్రాణ, సములుగాఁజూచుచునాఁడువారు
ఒక్కంటువ్యాధికిఁ జిక్కియాత్తగాఁ, బరమపదముఁజేర నరిగినంత

తే-గీ. అల్ల శిశువులఁగన్గొని యాదరించు, దిక్కులేదయ్యెఁబొరుగింటి యొక్కయువిద
తనయపత్యంబులంజేర్చి పెనుచునట్టు, లేరుపడనయ్యెనటఁజేరు వారుసెప్ప. 11

ఉ. ఓపికయొంతయుండిమన సొప్పినదైనను లాలివాండ్రన
ల్లాపెనిజాత్మజప్రతతి యట్టులసెట్టులఁజూచునైననే
లోపములేరుకంద్రుప్రబలుండగునీశ్వరు శాసనంబుఁదా
మాపఁగలండెయేఁడయిన మాసములిట్టులఁగొన్నిక్షీయేగుడున్. 12

ఉ. ఒక్కరుదంపతుల్సుగుణులుత్తరదేశము వారపుత్త్రికు
ల్పెక్కులునోచినోములుల భింపమిబిడ్డలు తీర్థయాత్రలు
న్దక్కినమందునొప్పనగు దైవములన్భజియించునిబ్బరం
బక్కఱగాబయల్వెడలి ష్టియధ్వవశంబున నొక్కనాఁటికిన్, 13

శా. వారాయూరికి దైవయోగమునఁబోవంగల్గుటింకానిరా
ధారుల్బిడ్డలుసేరి నింటికడనే తాముంటయెట్టెట్టొత
చ్చారిత్రంబఖిలంబును న్వినుటయు న్స్వాధ్యంబుకాఁగారహిం
గోరంబుట్టెఁదలంపు పుత్త్రికునినె క్కన్నట్టియాస్థన్వడిన్. 14

ఆ. ఇరుగుపొరుగువార లిదిమేలు మేలంచుఁ, జెప్పనొప్పగించెఁ జేర్చినమ్మ
దేవదత్తుఁడనిమ దిన్న మిమ్మకై కొని, వారలేగిరున్న వాంఛఁబట్టి. 15

ఉ. ఇంకనుగొన్ని మాసముల కెవ్వరొయిట్టిరె పుత్త్రిసంపద
న్వేంకటనాథుఁగొల్చికొను వేడుకతో నిలువీడిరాఁగనీ
వంక కెవారుచేరుటల బాలికవృత్తమెఱుంగఁ గల్గులై
జంకక కోరికై కొనిరి చక్కనిమక్కువ నక్కుమారికన్. 16

ఉ. వీరును వారియట్లుటల భించినబిడ్డను గొంచుఁ బోయిరా
తీరునఁదీర్థయాత్రలును దేవసపర్యలుఁ జేసిచేసియే
వారలువారియూరులకు భద్రముగాఁ జనికొన్నియేఁడులా
యూరులనుండిరొయింటగమ నోత్సుకులైరల వారణాసికిన్. 17

కం. వారెరొ వీరెఱుంగరు, వీరెరొ వారెఱుఁగరు వీరున్వారే
ర్వేఱగు దేశములజనులు, చేరిరి కాశికిని దైవ చిత్రము పేర్మిన్. 18

మ. ఒకపుట్టంబున నొక్క సత్రమున నేఁ యున్నారు కొన్నాళ్లు వా
రికిఁదోడై స్నేమతి కొందఱుండిరి విచారింపంగ నయ్యందఱె
న్నికగా బిడ్డల నిర్వుఱంగను మరాణింపంగనున్నట్టియ
య్యకలంకాకృతి సద్గుణోన్నతియుఁ జే యన్మార్గము త్సాహులై. 19

మ. అలబిడ్డల్సరిరూపము ల్గుణములిం కన్యోన్య సౌహార్దము
లక్కలవారంచు వివాహయోగ్యవయసుం గన్నారలం మన్మహా
స్థలమద్దొటనటిట్టి కార్యమయిన న్సౌఖ్యప్రదంబంచు నా
తలిదండ్రులు మ్మదమంది యొప్పికొనబో ధల్పేసి రొక్కమ్మడిన్. 20

చ. హళహళిఁదైర్థికావళియ హోస్థనుబూన్పఁగవారి తల్లిదం
డ్రులుసమయోచితంబుగని రూఢముచేసికడంగ జ్యోతిష
జ్ఞులుసుముహూర్తమేర్పఱుపఁ జూడమహోత్సుకతం బొనర్చనం
దులకెజనాళియెచ్చటిక తోనెరవేర్చిరి పెండ్లియయ్యెడన్. 21

చ. పరిణయమట్లొనర్పనెడఁ బౌరులుఁదైర్థికులెల్ల నావధూ
వరులవిలాససంపదల పారములై తగునట్టి ఫక్కియే
కరమనురాగమొప్పఁగము ఖంబులు సేరఁగఁ బోయి చూచుచు
న్మరియుచుఁ జెప్పికొనయిరి ముచ్చటలెచ్చుగ నిచ్చ మెచ్చునన్. 22

ఉ. ఆగలిముద్దుగా జరిగినట్టివివాహపుఁ బూర్తి వేడ్కకై
సాఁగఁధఁ జేసిరొక్కడను జక్కనివిందల యాత్రికోటికి

స్వాదుగభోజనంబులయి పల్కులఁగాలము పుచ్చువేళఁదా
నీగతిఁగన్యతండ్రియనె నేర్పడనైన ముదంబురేఁపఁగన్. 23

తే-గీ. కన్నతలిదండ్రులుడిగిమా కరములఁబడ, నైననేమాత్మపుత్రిక యట్టులగని
పెనిచినందులకెంతయో ప్రీతిఁగూర్చు,! పెండ్లి మాబిడ్డకైనదే పెద్దముద్దు. 24

మ. అననేపెండ్లికుమారు తండ్రియనెఁదా నద్దేప్రకారంబుగాఁ
బెనుపంగైకొనినట్టి బిడ్డఁడనుచుం బ్రేమాస్పదం బెండ్లిచే
సినసంతోషము దక్కనేఁటికనుచుం జిత్రంబుగానవ్వివిం
చునుగూర్పుండిన వారదిద్దియడుగం జూపట్టెసందేహముల్. 25

ఉ. కావునవారలిర్వురును ఖాముఖిముచ్చటలాడ సాఁగనే
యావివరంబు తేటపడె నన్నయుఁజెల్లెలెయట్లు వైరటం
చావురుమంచు నేడ్చిరపు డాండ్రటువచ్చి యొఱింగిచెప్పిరోం
చావిధిఁదాముఁజింతిలిర హాయనిరెల్లరు విస్మయంబుగన్. 26

కం. అపుడెవ్వరరయఁదొడఁగిన, నుపమములంగములనుడుల నున్నవిధంబే
విపులముగఁదోఁచుఁగానిము, నుపుతెలియదెయీశుమాయ నూల్కొనుకతనన్.

కం. తగువయసువచ్చియున్నది, తగుదాంపత్యమనిప్పుడులఁ దగులుకొనెఁగదా
యగపడెసోదరతయిటుల, దిగులాబిడ్డలకుఁగలది దేవుఁడెఱుంగున్. 28

ఉ. అంతటివేడ్కపెండిలికి నట్టివిఘాతము సంభవింపఁగాఁ
జింతిలరేరు? పూనికగఁ జేసినవారి విచారమేమనం
గొంతయిటేడ్పుకాలమును గూడఁజనంగనటున్న పెద్దల
త్యంతభయంబుతో నరయనైనదిపాచితమంచు నేర్పడెన్. 29

ఉ. చేరిరివారణాసిఁగల శిష్టులపూర్వపుఁ గార్యమిద్దటం
చారయఁగృష్ణవేణియను నట్టిమహానదియేజగాననీ
ఘోరపుఁబాతకంబుడుపఁ గూడినదంచని తేల్చిదంపతు
ల్తీరమునంటియొంటిఁజన దీక్షగమేలని తీర్పుచెప్పుడున్. 30

కం. అలబిడ్డలతలిదండ్రులు, పలునోములునోచిపడసి పాలించినబి
డ్డలగతియటు కాఁదమగతిఁ, దలఁచుచుదుఃఖింపనైరి తరమేమాన్పన్. 31

తే-గీ. మున్నుపెండ్లికిఁబురికొల్పి యున్నవారె, తల్లిదండ్రులబిడ్డల నెల్లఁగొనుచు
వారుఁగూడనువెల్వడి చేరనైరి, కృష్ణపుట్టినసహ్యాఖ్య గిరికెలనికి. 32

మ. తలిదండ్రుల్సుతమోహము న్విడనసాధ్యంబైననాత్తైర్థిక
ల్కలవార్త్తల్తగు బోధసేసియదియే కర్తవ్యమంచన్నచె

ద్దలపల్కె హృదిసంధిలంబోనిపియుం దామట్టుకావింపమిం
గలుషంబెల్లరవుండు నన్నిమిష సాఁగంజేసిరక్కార్యముల్. 33

సీ. అమలమనస్కులై యద్రినారోహించి, బ్రహ్మాఖ్యశిఖరము పైఁ గనుఁగొనఁ
దన్మూలధారతోఁ దనరుశ్వేతాశ్వత్థ, వృత్తరాజంబు ప్రత్యక్షమగుడు
ముందెల్లరును స్నానమును జేసినూత్న దం, పతులకుఁదగునట్టు హితముఁజెప్పి
వారినిశ్చలతయు పారధీరతయు గాం, భీర్యంబుఁ బొడగని ప్రీతిఁ జెంది

తే-గీ. నీలచేలంబులను వారి కొలిఁగట్టి, యొండొరులతోడ భాషింప నుండఁదీర
మంటిచనస్నానపానంబు లందొనర్పఁ, జెప్పికృష్ణకుఁ బ్రణతులు సేసియనిరి. 34

శా. అంబా మాయపరాధమేయిదయియీ యజ్ఞానులం జాలమో
సంబంధూన్చిన వావులేరుపడసా సంబంధమిట్లయ్యెనా
యం బేదో యది బుద్ధిహీనులకుమా కర్థంబు కానేర్చునె
ట్లిందొప్పేదొ విధింపు మిష్టఫలదా యీకృష్ణవేణీశ్వరీ. 35

మ. పొరపాటీయది మారొడంగలిగెసం పూర్ణప్రమోదంబుతో
జరిగెం బెండ్లి లిలేశమైనఁ దెలియ న్సాధ్యంబు కాదాయెమా
వరమాత్రుల్వారి మాయమున్గటరుదే నానామునుల్మగ్నసే
దరికింజేర్చెదొ నీవెదిక్కుఁ గనుమా తాకృష్ణవేణీశ్వరీ. 36

మ. సకలార్థంబు లెఱుంగునట్టిబుధులా, శాస్త్రంబులీశాస్త్రము
ల్ప్రకటింపన్భవదీయ దివ్యమహిమ ప్రాశస్త్యముం గాంచి చెం
తకుఁ జేరంగఁ దరింపఁ జేయఁగలస ద్దైవంబవీవంచుఁ దె
ల్పికరం బాసనుగూర్చవచ్చితిమిత శ్రీకృష్ణవేణీశ్వరీ. 37

శా. మాతా మాగతి కేమి వీంద్రుబుధుతశ్శీలా మతాపితల్మన్నిలే
రీతీరై రిపుడీవెయేలికొనుదే వీయంచుఁ బ్రార్థించినీ
చేతం బెట్టియిఁ కూరకుందుమలకా శింబండితా గేసరు
ప్రీతిం జూపిన మార్గమిద్దికడ తే, రెంగృష్ణవేణీశ్వరీ. 38

మ. తగుచొప్పేదొయదే మదిందవులబో, ధస్సేయుమావీరికి
న్వగపెన్నండు మనంబునందగులనీ వద్దమ్మనీతమ్ముల
న్దిగనాడందలఁపంగ నీకు మెదసం దేహంబు లేకుండని
న్నొగిఁగొల్వంగడ తేర్పుమమ్మ మహితా యోకృష్ణవేణీశ్వరీ. 39

చ. అనియిటులొప్పగించివిడ నాడియ థేచ్ఛగ వారలేగన
య్యనుపమధీనిధుల్విడక యానదియొడ్డున వానదీశుతో

నను దినమందె మున్కలిడి యాజలమాస్థను గొల్చుచుండియుం
జనిరట విశ్రమించినను సాఁగినఁదీరమె శ్రేయాశ్రయంబుగన్. 40

శా. పూర్వోక్తాఖిల తీర్థ రాజములసంపూర్ణప్రయత్నంబుతో
నిర్వర్తించుచు స్నానముఖ్యవిధుల న్నీతంబుగానుండునా
శర్వున్విష్ణుమహేశ్వరిం గొలుచుచు న్నాఁగంగనాసాఁటికి
న్సర్వోత్కృష్టత యేర్పడంగనగు మేల్జాడల్కనంగాఁబడెన్. 41

సీ. అలనదీతీరంబు నందేగుచోఁ గూర్మిర, సత్వంబులెదురైన జడియరుగద
ఒకతల్లి బిడ్డలై యుండినదెటేఁగిరే, తొలియనుబంధముం దలఁపరుగద
సైకతస్థలములఁ జక్కని గాడ్పుల, రమణీయతలుగన్న భ్రమయరుగద
పలుజంతువులజంట లలరువిధముఁగన్న, డెందంబునను మోహ మందరుగద

తే-గీ. ఏమొనర్చినవారిసే రేమనెదరు, ఒంటిఁజనెడివయస్కుల జంటయూయె
వారిమదినిబ్బరంబెంత పటిమకలదొ, దానిఁగనిపట్టి కారుణ్యమూనెఁగృష్ణ. 42

చ. ఘనులగువారికల్మషము కానఁగరూపము మాసెనాఁగఁద
త్తనుగతకృష్ణచేలములు దైవవశంబదియే విచిత్రమో
కనఁగనశుక్ల వస్త్రములు గాఁదమవర్ణము మారియొప్పెని
య్యనువెలుఁగంగ నేర్పడిన యాహ్వయమేకద శుక్లతీర్థమా. 48

ఉ. దేవతలున్మహామునులు దీనజనావనరైన కృష్ణస
ద్భావముఁగాంచి మ్రొక్కిచనఁ బావనుఁడైన యగస్త్యవశానియా
దేవిని పెక్కుభంగులను తింపనుతింపఁ బ్రసన్నరైవరం
బీవలెనంచు నిల్వఁగని యిట్లనియెన్మునిసత్తముండొగిన్. 44

శా. అంబానీమహిమాతిరేక మిదియం చాయెచ్చువర్ణింపసా
ధ్యంబా మూర్తులకైననీదు దయచే తంగాని కార్యంబులే
శంబైనంగనరాదు రాదునినునా స్థంగొల్వలోపంబునా
శంబొందింతువు ఘోరపాపములనో జంగృష్ణవేణీశ్వరీ. 45

మ. క్షమతోడన్నిను నమ్ము వారలకు వాంఛత్తిఁబుట్రంబెయి
క్కొమరుంబాయపు బంటనీత మెడఁదం గొన్నట్టుకన్పట్టియు
త్తమశోభన్ఘటియించితీ వరయ త్క్షేత్రంబిద్ధిదో పాపహం
బమలుల్గారె ప్రజాళి నమ్మియుటడా యంగృష్ణవేణీశ్వరీ. 46

మ. ఘనసాంబున్మహిమాఢ్యు భూతదయకై కాంక్షించియున్నిల్పిపూ
జనముల్స్రల్పుదు సాతఁడుండునిటని చ్చందానగ స్త్యేశుఁడై

యనుమీ క్షేత్రము నాదు పేరఁదగున ట్లద్దేమదీయేప్సితం
బొనరుస్నానకుఁ బ్రసిద్ధి నీమహిమతో నోకృష్ణవేణీశ్వరీ. 47

కం. అనవినియీకొనమూనితన, మనమునఘునశివునినిలిపి మనవిర్యొనర్పం
గనెనిలిచెనగస్త్యేశుం, డనునామముతోడనచట ననువగుశివిక్. 48

చ. అదియొకపుణ్యతీర్థమట నాస్థనుస్నానమొనర్చి యీశ్వరు
న్నదయుభజించుమానవుని సత్ఫలమెన్నఁగరాని యంతదా
కొదలెయఘుంబుమాసెడిని ముక్తివిధాయకమంత మందిఁకం
బదపడియల్లజంటచను పట్టునవ్యాఘ్రపురంబు రంజిలెక్. 49

తే-గీ. అనుపమానప్రభావంబు నందునందె, సంగువ్యాఘ్రేశ్వరాభిఖ్య లింగమూర్తి
అచటిస్నానంబు దానంబు లతిఫలదము, లాడఁగృష్ణనువేణతా వీడియరిగె. 50

కం. అలదంపతులే మెంచిరో, తెలిసియొ తెలియకయొ వేణ తెరువునదరిపైఁ.
దొలియట్టైచనఁగనొక్కుఁటఁ, బొలిచెవిమానంబదెక్కి ముక్తిఁగనిరటక్. 51

శా. ముక్తిక్షేత్రమనంగనొప్పెనదిస మోదంబుతో నాడఁదా
ముక్తీశుండననొప్పు చుండెడినిశం భుండద్దినంబాదిగా
శక్తింగూడి సమస్తదేవతలు కాం తుందన్ను సేవింపనే
భక్తుల్గొల్చిన నిష్టసిద్ధి నిడిసం భావించిరక్షించుచుక్. 52

మ. జనుఁడెవ్వండట నిల్చిలక్ష్యమమర స్నానంబు దానంబుఁజే
సినముక్తీశ్వరు భక్తిఁగొల్చినసుసం సిద్ధించునిష్టార్థము
ల్లిన మొక్కుండట దీక్షతోడనిలువ న్దివ్యప్రభావంబుఁగాం
చనుమోక్షంబఱచేతి పండనఁగనా శుద్ధుండుతానాటచేక్. 53

శా. ఆపై వేణమహోదధిం గలియనా నాస్థన్వెసంబాఱస
ల్లాపాలింగనసక్తఁడై యుతఁడుచా లంబ్రీతినున్నట్టుగా
దీపింపంగల వీచికాప్రతతిచే దృగ్గోచరంబౌడుఁదా
నేపుంజెంది తటాలునన్గవయనా యెన్మోడుమార్గంబులక్. 54

మ. తనవెంటన్వెసవేగు దెంచుసురలు స్థాత్రజ్ఞనాభేశ్వరు
ల్మునిసంఘంబులు వింతనొందికనఁగా ముత్తోవలై పాఱిచే
రినవేణాఖ్యమహిమంబు గానఁబడియె న్లెక్కింపశక్త్రయం
బునుదానే యగునన్నగుట్టదెలుఁగ న్భాషించిరొక్కుమ్మడిక్. 55

చ. ఘనుఁడగునాపగాధిపతి కాంతనుజేరఁగఁ దీపిపొంగఁగాఁ
గనుఁగొనియెల్లరుంబాగడఁ, గంధరముల్పను వృష్టిసమ్మరిం

చెను సురదుందుభుల్ధ్వనులు సేసెను వేడుక నాడి రచ్చర
ల్తన రెనటన్గిరీశుఁడుము దంబున నప్పుడె సంగమేశుఁడై. 56

శా. ఆపట్టిట్టిదటంచుఁ జెప్పఁదరమే యాబ్రహ్మకైనన్మహా
పాపంబుల్కడుఁజేసి యున్న నరుఁడే పర్వంబునందైనఁదాఁ
జూపట్టంగలఁడే నట న్విమలుఁడై శోభించియింకెప్పుడే
లోపంబుండని సద్గతింగనెడుగ ల్గు స్వానికిస్తార్థముల్. 57

కం. స్నానము దాన మొనర్చినఁ, బూనిక నా సంగమేశుఁ బూజించిన నా
మానవుఁడీశ్వరసముఁడను, మానము లేదెన్నఁటికిది మానక జరుగున్. 58

ఉ. వేణయథేచ్ఛ నేగఁదను వీడినఁగృష్ణమతొక్క తోరివఁబో
నాణియమంచు నెంచినది నాఁగఁబృథక్కయికొంత దవ్వుమా
గాణముదీవిమైవిడువఁ గాఁబడునట్టులఁ బాయెనల్ల వి
న్నాణము చెప్పగిప్పనగు నాతగు నామనయట్టి వాంఛకున్. 59

ఉ. పుట్టినచోటినుండియొక పొత్తువవచ్చిన భేదభావమే
యుట్టిపడంగ స్వాంతముల నూహలవెట్టివొ తేలెనాథుచే
పట్టెడి నాఁటి గుట్టిదిస పత్నులు సోదరులైన నేమిచూ
పట్టునె యొర్వొకళ్లొకరి భాగ్యము చెంతల నిల్చి కానఁగన్. 60

కం. అతులులకైనం దమతమ, మతములకనువైనవిధినె మార్గములరయ
న్గతపడుగతులతి హితముగ, నితరులజలస్థితికె కాని యదిగలికగునే. 61

తే-గీ. లోకమునకిట్టినీతిని వీఁకఁ దెలుప, నైనయట్టుల సేర్పడ్డవైనమిద్ది
వేణ విడి కృష్ణ వెడలఁగా వెలసె ముందుఁ, జిత్రముగ నుసుబ్రహ్మణ్య క్షేత్రమొకటి

శా. ఆ క్షేత్రంబునఁ జేసి స్నానమునసుం డాస్కందు నర్చింపనా
దీక్షన్నిల్చినఁ బెక్కఘుంబులడఁగుం దృప్తిన్వహింపన్నిజా
పేక్షల్తీఱును బాడిపంటలమరు న్భృత్యాళినాప్తౌఘము
న్రక్షింపంగల శోభనొప్పితుదకు న్సాయుజ్యముం బొందెడిన్. 63

ఉ. ఉన్న దికోరిశతీర్థమొకఁ డుత్తరవాహినియాచుఁ గృష్ణయ
భ్యున్నతిఁ గాంచుటం దనరి యొద్దిక సేఁడటఁ బైతృకంబుచే
యన్నిలుచుందదుత్తముసి యన్వయమెల్లఁ దరించు నంతమం
దెన్నఁగ ముక్తిలభ్యమగు నెందఱొ మానులు ముక్తులై రటన్. 64

సీ. అంతనొప్పారున నంతఫలప్రద, క్షేత్రరాజంబుప విత్రమగుచు
ఉన్నదికృష్ణదా నుత్తరవాహిని, యైనపొందిక నెస మాన్యనమొప్ప

అట్టివో, గర్కోటకాహీంద్రసంస్థాపి, తేశ్వరుండలరునా గేశ్వరుండు
పార్వతీదుర్గలు భయపార్శ్వములనొప్ప, సంతోషపూరితస్వాంతలగుచు

తే-గీ. సకలవిధములగరిమమెన్నికయొనర్చి, పూనిపరిశీలనముచేసి పూర్వపండి
తవరులనియున్నప్రకటనవివరమరయఁ, గలదునామంబెదక్షిణకాశియిదని. 65

కం. కదళీవనమునసాంబుఁడు, ముదమొప్పఁబ్రసన్నుఁడయ్యె ముందుగదానం
గదళీపురమనుసంజ్ఞనె, విదితంబైయున్నదదియె వివరింపంగన్. 66

చ. కలదటనాగకుండమనఁ గాఁదగుపేరఁ దటాకరాజమం
దలరెడిమత్తబంభరసమాశ్రితముల్లతపత్త్రికోటులుం
గలువలునూడముచ్చటగఁ గల్మషవారణమెట్టులున్నఁద
జ్జలకణపానపూనమము సంతతరోగనివారణార్థమై. 67

ఉ. మున్నువసిష్ఠమౌనితపమున్బొనరించి కృతార్థుఁడైనభా
స్వన్నిలయంబదంచెతేఁగి పట్టుగగాధిజుఁడాడ నిల్చియుం
బన్నగరాజతల్పునిఁగృపాళునిఁజేసికొనంగఁ గల్గియం
దున్నిలిపెన్నమస్తజన దోషమునాశము చేయువేడుకన్. 68

కం. గోపాలమూర్తికరుణా, కూపారుఁడుక్షేత్రపాలకుండై యొప్పున్
నాపునశివవిధికుండము, లోపుంబాపాపహరణ ముద్ధతిఁజేయన్. 69

చ. అటనదుగిడ్డఁజాలునుమహోఘములెన్నిభవంబులందుము
న్నెటులఁబొనర్పనేర్పడిన వెంతటివున్ననశించునెల్లసం
కటములువాయుధార్మికుఁడు కాఁగలఫక్కియదే ఘటిల్లున
చ్చటఁదగిస్నానదానములు శంకరపూజలు సల్పుచుండినన్. 70

మ. నరుఁడయ్యుత్తరవాహినీనదినిదా స్నానంబుఁ గావించిభూ
సురులంగవ్యమొసంగి తృప్తిపఱుప న్పుద్ధాత్ములై వంశజు
ల్తరియింత్రెల్లరటొక్క పర్వమునఁజేఁ తంబున్నెమిట్టిదిదం
చరయంజెప్పను శక్యమేవిధికినిం కామేటిశేషాహికిన్. 71

కం. ఎవఁడైనఁబూన్కినిమహా, శివరాత్రిసటన్వసించి చేతఃప్రీతి
న్భవునారాధించినఁద, చ్ఛివునంగైక్యంబునొందుఁ జెందఁడుభవమున్. 72

శా. అంతంగృష్ణమహోదధింగలియనానాసక్తిఁగాన్పింపబ
ల్సంతోషంబు వనేగఁదొనరుగుభాసానాథశౌరీశ్వరీ
కాంతుల్దిక్పతులెల్ల నిర్జరులునిం కన్సర్వమౌనీంద్రులు
స్వాంతంబందతి చిత్రమంచుఁగనుఁగొ సాఁగన్సముద్రుండొగిన్. 73

సీ. రమ్మురమ్మనుచను రాగయుక్తాహ్వాన, ముడుగక చేయుచుం దడినిబడియు
ఆస్థఁజేరంబిల్చు హస్తాభినయముగ, రంగత్తరంగవా రములనిపియు
సద్యస్సమాగమ పాద్యమీనొక్కింత, దూరంబునకుఁదన వారివిడియు
విదితకౌతుకసార బిందుసందోహంబు, లందంబుగాఁబయి జిందనిడియు
తే-గీ. వారవీకేరుచేరనా తీరెఱుఁగక, బోరగిలినను వెను వెంటఁ బొంగుచుండెఁ
దగదెయతనికిఁగలవారి సొగసుకత్తె, తనువరింపఁగనింటిచెం తకు నెరాఁగ. 74

శా. ఆయుత్సాహపుఁ జేష్టలింపొదవున త్యాహ్లాదముప్పొంగఁగా
నాయంభోనిధి చేయఁగాంచునెడఁదా నానందనిర్మగ్నుఁడై
యాయంభోరుహ నాభుఁడిట్లనియెన య్యారయేనయారూపమై
డాయన్వచ్చితిఁ జేర్చికొమ్ముకృపతో డంగోర్కెలీడేరెడున్. 75

చ. జనములుపాపకర్మములు చాలఁగఁజేసిన హైన్యమబ్బువా
రనఘులుగాఁబొనర్చినమ హాదశవారికెసంభవించునం
చనినవిరించిపల్కులకు నందిననాడగు రూపమిద్దిసాం
బునికరుణన్ఘటిల్లెఁబని పూన్కికినిబ్బడి యాచుగొబ్బునన్. 76

కం. లోకముపావనమొనరిఁచి, వీఁకంగృతకృత్యుఁడగుదు వేడుకతోనిం
బైకొనఁగవచ్చుకాంతం, జేకొన్నంబర మముదముఁ జెందుదుమననే. 77

సీ. నిర్జరుల్దుందుభి నినదంబులొనరింపఁ, గూడిగంధర్వులు పాడుచుండ
అప్సరోంగనలున్నృత్యంబులుసల్పంగ వారిదంబులుపూల వానకురియ
బ్రీతినిదిక్పతు ల్పెండ్లిపెద్దలుకాఁగఁ, బేరటాండ్రై వారి ప్రియలమరఁగ
వేధయుసన్మునులు వేదముల్చదువంగ, శివహరుల్మంగళా శీస్సులొసఁగ
తే-గీ. సూర్యచంద్రులుఁదాగలు నొశ్శభిలంగ, నిర్మలాంతఃకృపాసార నిశ్చలమతి
కీర్తిసంశోభితాశాంతఁ గృష్ణకాంత, స్వీకరించెనుసతిగర త్నాకరుండు. 78

తే-గీ. ఏడకేగెనొశమకంబు లెఱుకపడవు, వింతకదధ్వనిలేదుర వంతరైన [పతియు.
ఉభయగాంభీర్యములు నొక్కయుద్దియాయె, లోతెఱుంగునె పాతాళలోక

చ. అనుకూలత్వము దీటుగానిఱువురి ట్లందంగనేకత్వమే
కనుఁగొన్నై సరసంపుఁ బల్కువెగళ్లై కార్యంబవార్యంబుగా
నొనరంజేసికొనంగ నూనుటొకటే యొప్పంబ్రసిద్ధంబుగా
ననువద్దేయిట నేరు పడ్డదికదా యార్భాటమింకేటికిన్. 80

చ. కనుఁగొని దేవతల్మునులుఁ గామినియాతటినీలలామతో
వననిధిరైక్యముంగనుట వర్ణనచేసియుఁ జేసిస్నానము

ల్మనుజుల కేర్పడం దగు క్రమంబును బూసలు గ్రుచ్చినట్టుగా
ననిరి వదిన్మనింగియట నబ్ధి నిమున్గి నదిన్మనుంగఁగన్. 81

తే-గీ. పర్వమందైనఁ దాసయాఁ బరశివుండు, ఊరకెపుడైన నందు సాయుజ్యమింక
కాంచిరేగిన స్వర్గముఁ గాంచుమదిని, దలఁచికొన్న నుబాపము ల్తొలఁగు ననుచు

ఉ. అట్టిదిసంగమస్థల మహత్తది యిట్టిదటంచుఁ జెప్పఁగాఁ
బుట్టినవారిలో నెవరుఁ బూననెవూనరు శక్తిలేమి నే
యొట్టిమహాత్మలైనఁ దమ కేర్పడనైన కళంకమచ్చట
న్గిట్టునటంచు నమ్మకొని కేవలభక్తిని బోదు రిచ్చతోన్. 83

కం. అదియార్పలేని పాపము, నదికూర్పఁగలేని సుకృత మారయఁగలదే
యది నేర్పలేని ధర్మం, బదిచేర్పఁగలేని పదవి యట్లే కాదే? 84

శా. ఆపుణ్యోదకతీరమందలరుఁ దానజ్ఞాతుఁడుత్సాహియై
గోపాలాహ్వయుఁడై మహామహిమతో ఘోరాపదల్బాపుచుం
బాపై భక్తజనాళిఁ బ్రోవఁగను సంపద్యుక్తులం జేయుచుం
గాపైఁ గోరిన దివ్యసౌఖ్యములనీ యన్దీక్షతో నిచ్చటన్. 85

ఆ. అల్ల సామినిల్చి నాపట్టునరుఁ బేరు, అంచదీవి దాని కద్ది యెట్టు
లేరుపడియెనన్న నీవింతకథ విన్నఁ, దెలియునెల్ల మిగులఁ దృప్తిగాను. 86

చ. ఒకయతి యద్ది నిర్జనము నుత్తమదేవనివాస పాత్రము
న్నకరనదీతటంబునను చుంగని పొంగిన యంతరంగమం
దకలుష భావమేర్పడఁగ హాయిగ నిల్చి ముదంబుతోడ సా
త్వికతప మాచరించి కడ తేఱఁగఁ గాలము పుచ్చుచున్నెడన్. 87

చ. దినదినమాతఁ డానదిని దృప్తిగ స్నానముచేసి యాలయం
బునఁ దన నిత్యకర్మములు పూర్తిగఁ దా నొనరించి యంతనె
మ్మనమున మంత్రనాయకుని మంత్రగురున్నెలకొల్పి నిష్ఠతోఁ
గనులను మూసి లోన నెడుఁ గల్పమహీజము మంత్రరాజమున్. 88

మ. దినమద్దేపనిగాన తండునికి సందేహంబులేదేమియుం
గననచ్చో నెదిలేమి నెమ్మనమునం గాంతుల్ప్రవర్తిల్ల వా
యనువందన్గన నిష్ఠతో జపముని త్యంబెచ్చుగాఁ జేయుచుం
దనమంత్రేశ్వరు నిష్కళంకకృపనొం దం బాత్రుఁడై శోభిలెన్. 89

చ. జలములనాతఁ డొక్కయెడ స్నానమొనర్చుచుఁ బైఁగనంగ నొ
క్కలవడి నాకసంబునను గాక మొకండు పయోధిఁ గృష్ణ ని

శ్చలముగఁ గూడియున్నెడఁ జయ్యనఁ బాఱుట కానవచ్చినం
దలఁచెనదొక్కచిత్రమని తానటులెన్నఁడుఁ జూచియుండమిన్. 90

ఉ. అంతనొకింత సేపటికి నంతకు మించిన చిత్రమంచుఁ దా
మంతనమందు నెంచుగతి మాన్యవిహంగమహంస యాచన
ట్టెంతయు వేగఁ గృష్ణయుదధీశ్వరుఁ గూడిన పట్టునుండియే
సంతసమొప్ప వెల్వడుట సక్కఁగ నయ్యతికిం గనంబడెన్. 91

మ. అనుమానించుచ పూర్వమద్దనుచుఁ దా నంతస్సులో నెంచుచుం
గనుఁగొంచుండఁగ నేగ నద్దికడు వేగ న్మింటితోఁ బ్రివన్మనం
బున నాతండది యెన్నుచుం దెపనిగాఁ బూనంగ నెట్టెట్టొయా
దినము నేఁ బ్రియియు నేగ స్నానమునకే తెంచెన్యతీంద్రుండొగిన్. 92

ఉ. నిన్నటియట్టి కాకమల నింగినిబోఁగని హీనపక్షియం
చెన్నియదింకనొందనగు నెచ్చదళంగనలేచి యుండబ
ల్వన్నియనొప్పు హంసయయి వచ్చుట కానఁగవచ్చె సంతసం
బెన్నఁగరానియంతగుడు నిట్టులనయ్యతిపల్కె మ్రొక్కుచున్. 93

తే.గీ. పక్షిరాజమ నేనొక్క భిక్షుకుఁడను, జపమపేక్షించియిటనుండుఁ జదలనిన్నుఁ
గంటినిన్న సుమనమునిల్కడ చెదరెను, నీదువృత్తాంత మెఱుఁగస మ్మోద మొదవు.

చ. తెలుపవె నాఁగ నాగియనె దివ్యఖగేంద్రము ముందుగా యతీ
కలువమడం గనీకిఁకను ఖంబొనగూడు మహద్దళంగనం
గలిగితి కాననన్గ నఁగఁ గల్గితిగు త్రిదె సిద్ధులైనవా
రలెకదమమ్ముఁ గాంత్రుపివ రంబుమదీయ మెఱుంగు తెల్పెదన్. 95

కం. ఏనగుదుగంగఁ గాశి, న్మానిని యొక ఱంకులాడి మజ్జనమున నే
నూనెదవాయసహైన్యము, మానిచియిటఁ గృష్ణహంస మాన్యతనొసఁగున్. 96

మ. అలవిపాఁ బ్రింగన కోడెగాండ్రపటు మోహంబందుఁ దా ముగ్గిత
త్కలుషం బేటమునింగి పాపికొనుడుం దద్దోషమే నందిని
ర్మలతం బొందుదు నీడఁగాననిటకే రాఁబోవని ట్లేర్పడెం
గలిగ న్నేఁటికి నీవు కాంచుటిదినా కర్మంబు సుమ్మీ యతీ. 97

ఉ. అందఱిదోషముల్తొలఁగు నట్లొనరింతుమ వన్నిమాపయిం
జెందనెయిట్లు మోచనము చేసికొనంగమ కించు దుందుమీ
చందముకృష్ణనుండదిది సర్వమహోఘము లాఱ్చఁగానితా
నందదువానిఁగానమును నందఱఁబ్రోచు పవిత్రయిత్యదే. 98

తే-గీ. ఉప్పరంబునకంటెన యున్నతిఁగని, రత్నమయమయి కాన్పించు రాణఁదనరి
యున్న గోపురముల సొరఁగన్న తీరు, మఱవనౌనొక్కొ యెన్ని జన్మములకైన 99

మ. అనిభాగీరథి తెల్పియేఁగ యతినిత్యాచారముల్నిత్యతో
నొనరంజేయుచు నెమ్మనంబుననుని ట్లూహించియుత్సాహియై
యనియెందానటు సేఁత పున్నెమగు కార్యంబంచు నద్దాతపం
బునకౌచై చ్ఛఫలియించు నంచెడఁదసంపూర్ణంబుగా నమ్ముచున్. 100

ఉ. కావున వెంట నేవెడలెఁ గాశికినయ్యతి యోగబల్మిచేఁ
బోవుట శీఘ్రి కాలమునఁ బొందెను దత్పురిఁ గాంచు సంతసం
బావిభవంబు సౌధముల యందము వీధుల పొందు చాటునా
నావిధవస్తుసంతతుల నవ్యవిలాసముఁ జూడ్కికింపుగన్. 101

సీ. నాల్గుమోములవాని నల్లనైతురుగాని, భారతిపై ప్రీతి నూరకుంద్రు
గండ్రగొడ్డలివాని మంద్రించెదరుగాని, మిన్నకొలము నెంచి మిన్నకుంద్రు
మూలఁ జేరినవాని గేలిఁగూర్తురుగాని, శివమిత్రుఁడనియార్ష్య జెందకుంద్రు
నీలచేలమువానిఁ దోలియుందురుగాని, హరిసహోదరుఁడన్న పరువుఁగంద్రు
తే-గీ. విప్రభూపార్యపాదజుల్విహితకర్మ, ధర్మములయందతీతులై తనరుచున్క
నన్నియున్నట్టివి స్తరి యడఁగియుండు, నన్నసామెత సాత్వికులై వసింత్రు. 102

మ. మెఱుఁగుంబోడుల వర్ణనంబులకుమా మిథ్యాప్రలాపంబులే
మెఱుఁగుంబొందికఁ గూల్పదేవతలలో నేసాటిలేరొక్కరు
న్మెఱుఁగుందీవియలొక్కొ స్వర్ణమునని ర్మింపంగనౌ బొమ్మలో
స్మరబాణంబులొ తళుక్కఁజక్కఁదనము న్సద్గంధమిట్లొప్పునే. 103

ఆ. దీనిఁబోలునట్టి తీర్థంబులేదేడఁ, బుణ్యదములనగ్ర గణ్యయిద్దె
యిట్టిచోటనుండఁ బట్టియే నీవిట్టి, దిట్టవై తివింత తీవ్రముగనె. 104

కం. మహితామరాలయంబుల మహనీయప్రభనటొప్పు మణిలింగంబు
ల్సహజోత్కర్షతనొప్పును యహహా యీ క్షేత్రమహిమ మారయవశమే. 105

కం. అనివర్ణించుచుఁ జనియొక, ఘనఘట్టముఁ జేరి రాత్రిఁ గడపియ చటఁ బ్రొ
ద్దున నదిమునింగి వచ్చెడి, వనితలఁ గనిపట్టఁ దీర వాసము చేయన్. 106

ఉ. భర్తల పాదముల్హృదయపద్మములందుఁ గలట్టులెన్ననౌ
గుత్తులఁ జూడఁజూడఁగన కుంఠితభావముఁ దోఁపఁజేయుస
ద్వర్తనముల్గలారటకు వచ్చిరి వందలవేలలెక్కనో
క్కర్తుకయుంగవంబడదె కాముకయంచతఁ డెన్నుచుండఁగన్. 107

సీ. జారకొప్పుననొప్పు చాలపూవులదండ, లాచెంపకీచెంప కాదుచుండ
మిక్కిలిచక్కనౌ చెక్కులబలుఁగోళ్ల, నొక్కులు నెత్తురు గ్రక్కుచుండ
మరుబుజంబునఁ బైట చెఱఁగునీటుగఁ ద్రిప్పి, వైవన త్తరుతావి వఱలుచుండ
నిదురలేనట్టుల విదితమౌ మొగమునఁ, దళుకుపూతరమెరువుఁ దెలుపుచుండ
తే-గీ. రొండినడ్డంబుగా బిందె యుండఁ బట్టి, యొండుచేఁ ద్రిప్పుచును బల్కుచుండి నడకఁ
గులుకులొయ్యారములు తీర్చి కూర్చికొనుచు, మాటమాటకు నగుచొక్క బోటివచ్చె

మ. మగవాఁడన్నను లత్తుమాతొలఁగునా మార్గంబునం దద్దిసే
ర్పుగ వావు ల్తగునట్టు వెట్టిపిలుచు న్బుద్ధినమ్మరల్పు చ్నమ్మరే
మగువం గన్ను బల్కరింపదొకఁట న్మాటాడినం జెంతఁబో
కఁగనౌపూరుషుఁ గూర్చి పల్కనదియౌ వాచాలతన్మిన్నయౌ 109

చ. కనెయలి దానివై ఖరియిఁ గంబరిశీలన మేటి కన్నమై
నొనరిన గుట్టులం దెలిసి యూఁకదానిన చూచుచుండ నే
మనుకొను నోమనంబునను హొభయభక్తులగంగ మున్నియ
య్యనుసకునర్ఘ్యదానమిడి యింటికి నేగెబు బానబిందెతోఁ 110

చ. యతినిను వెంట నేచనిత దాలయముంగని పట్టి దానిదౌ
వితమరయంగ నాఁటికల వీధినిటట్టు చరించుచుండెఁద
త్పతియటఁ తిండికింటికిని వచ్చియుఁ గాఁగనె వేగఁబోయెవాఁ
డితరులఁ గొల్చువాఁ డగుట నింటను నిల్వనె వీలులేమిచేఁ 111

తే-గీ. మూఁడుజాముల వేళగా మొదలుపెట్టి, యొక్కఁడైనమఱొక్కఁడౌ లెక్కగాను
వన్నెకాండ్రిలు దూరెడి వసతినగయ, దేననైనదొయనిపించు దానిమేను. 112

ఉ. ఒక్కొకవేళఁ గొంతతడ వొక్కఁడు సుండని యట్టులైనచో
నిక్కుచునద్ది వాకిటను నిల్చుచుఁ బోవుచు వచ్చుచుండు వా
రక్కఱకైనవారు కననైనఁ దటాలున బల్కరించి పెం
పెక్కినయాస్థలొ బిలిచి యెంతయుఁ గూరిమిఁ జూపిపం పెడుఁ. 113

తే-గీ. రాత్రిమగఁడేగు దెంచియు నాత్రముగను, అన్నముందినితాఁబడి యున్నశ్రమను
మేనెఱుంగక మంచము పైననొఱిగి, నిద్దురింపంగనపుడు నా ముద్దియయును. 114

ఉ. వేఱొక మంచమందుఁదగు వీలుగ శయ్య నమర్చియుంచియు
న్మాముపతిం బరామరిక మానక చేయుచునుండి యొక్కఁడుం
జేరును భర్త చెంతకును జిత్తమురంజిలునట్టులాతనిం
గూరిమి మీఱఁ గౌగిటను గ్రుచ్చి సుఖింపఁగఁ జేయుచుండెడుఁ. 115

శా. ఆమాత్రంబున కాలి మెచ్చికొని యత్యానందనిర్మగ్నుఁడై
భామారత్నమనంగ నద్దెయనిసం భావించి వర్ణింపఁద
త్సామర్థ్యంబెఱుఁగంగ నైనదగుటం జక్కంగనిద్రింపనా
నామార్గంబుఘటించి తావిటునిమోహంబిచ్చతోఁ దీర్చెడిన్. 116

ఆ. వచ్చువిటులు తెచ్చు వాసనద్రవ్యాదు, లింటికేగుదేరఁ గొంటినంచు
మగనితోడఁ జెప్పి తగుధనముంగొని, యిచ్చుఁగూర్చువాని కిచ్చునద్ది. 117

కం. ఒకనాఁటిచర్యచిత్రము, సకలము యతి కాంచి యిట్టి సతియే వేశ్యా
ప్రకరంబందును దాసీ, నికరంబందైన నున్నె నిరుపమ కదరా. 118

తే.గీ. ఇంతపాప మొనర్చెడి యింతిచేయు, స్నానమున గంగ కాపాట్లు సంభవించు
టబ్బురంబే మిటనుచు నా యతివరేణ్యు, డుదయమున గానుపించె నయ్యువిదపతికి.

ఉ. మేనొకదండమట్టులను మేదినిపైఁబడవైచి సాగిలం
గానలగేస్తు బత్తికిము ఖంబున లేనగవొప్పదీవన
ల్వానికొసంగి పల్కె యతి వందనమిట్టిది భిక్షుకర్థమోఁ
గానభవన్నివాసమునఁ గొంతకుఁ దెల్పి కడంకుమంచొగిన్. 120

మ. అనుమానించెనతండు పూర్వమునఁ దా నయ్యత్నమందుండమి
న్ఘనుఁడట్లన్న పుడూరకుంట కొఱయే కాదంచు నప్పెంచుటం
దననారీమణి యొప్పి కొన్నఁబనిసం ధానంబు కానేర్చునం
చనికొంచింటికిఁ బోయి వేతెలిపె భార్యం గాంచి యద్దంతయున్. 121

చ. తనస్థితులేమెఱుంగమిని దైవవశంబున వచ్చెఁ గాని యీ
రనుదనచే భుజించుటకు రాఁగలపెద్దలె యుండరంచున
మ్మనదది గాన నల్లపని ముఖ్యమటంచది శిష్టులందుఁ జే
ర్చుననుచుఁ బర్వపొందుటకుఁ జొక్కుచుటంచును సమ్మతించియున్. 122

ఉ. అల్లప్రయత్నమందె తన యాప్తులకెల్ల రకిష్ట భక్ష్యము
ల్కొల్లగఁగూర్పఁగావసతి కూడెడినంచెదఁ బొంగి భర్తతో
నల్లనఁ జెప్పి వస్తుతతి యంతయుఁ దెమ్మన నాతఁడట్టులే
మెల్లనముందుగా యతిని మీఁదటవస్తువులింటఁ జేరిచెన్. 123

కం. గంగాస్నానము తాఁ జే, యంగా యతియే గగరిత యనుగతరై యెయు
పొంగుచుఁ బ్రకటించెను దన, కుంగలిగిన పదవి సతుల కుంగుతుకమునన్. 124

సీ. ఆమాటవినఁగనే యయ్యయొయ్యవీఁడొట్టె, యతిపీనికెట్టిట్టి గతిఘటించె
ఆశ్రమంబేల యిట్లాశ్రయించినఁదీఱు, నాశ్రమలీశ్రమ లనుకొనియొనో

బిడ్డలు లేనియీ దొడ్డయిల్లాలికిఁ, బుత్త్రిభిక్షమొసంగఁ బూనుకొనెనొ
సతికింకనై క్యాను సంధానమార్గంబు, నుపదేశమొనరింపఁ గృపగనియెనొ

తే-గీ. కాకయుండిననిట్టిలోకప్రసిద్ధ, యింటికెట్లేగుదీనిచే నెట్లుకుడుచు?
మరలమనయిండ్లకు రాక మానఁడేమొ, ముందెమగవారికెఱిఁగింప ముఖ్యమనుచు.

తే-గీ. నిన్నఁదమ్ముఁనుగన్నంత కన్నమిన్న, తిన్ననగఁజూచిరతివల దైన్నికగను
అన్నియెఱిఁగియు నెఱుఁగన ట్లున్నయతఁడు, విన్నవోవక చెన్నందు సన్నునండె.

కం. అదిముందువోవయతియా, నదిలోఁదననిష్ఠలెల్ల నడపికొనంగా
మొదలిడిరిపాపమాతం, డెదియెఱుఁగనిక్రొత్తవాఁడొ యేమోయనుచున్. 127

చ. ఎరరెటులేమిపల్కనస హించివహించిన నిష్ఠనెమ్మదిం
దవిలినదొటమెల్లనగ దారిఁగనుంగొని వాఁడయింటికిం
బ్రవిమలతోయకుంభముక రంబునశోభిలఁ జేరునంతలో
నువిదసమస్తభక్ష్యములు నుత్సుకతంబొనరించియుంచుచున్. 128

మ. మగవాఁడంతయు భక్తిస్నానజపహోమంబుల్నివర్తించియు
న్నిగమంబుం బఠియించికొంచుఁదనసాన్నిధ్యంబెదంగోరుచుం
దగుపీఠంబమరించి పూజకగుస ద్ద్రవ్యంబులంగూర్చియుం
జఁగదానన్యతిసేరి పూజలుగొనె న్సంతుష్టులంజేయుచున్. 129

కం. మించినవేడుకతోవ, డ్డించెన్భక్ష్యములుతావ డిన్నతిపతికా
వించెనుహస్తోదకమీఁ, గాంచుప్రయత్నంబుదానిఁ గనియాతియిటనెన్. 130

తే-గీ. ఓయినాసరసనుగూరు చుండునీదు, వనితహస్తోదకంబీయ వలెననఁగనె
క్రొత్తయనిపించెఁబలికది చిత్తములరి, నిలిచెసిద్ధంబుగాసతి పలికెనుయతి. 131

మ. అనఘుత్వంబిపుడీవు పొందితనినీ హస్తోదకంబందెద
న్జనినీవు యథేచ్ఛనుండనయిన స్నానంబుభాగీరథీ
వనమధ్యంబున నింకఁజేయననుమీ వాంఛింతునీచేతినీ
రనుమానించిన భిక్షనొల్లనెదనీ యాంతర్యమూహింపుమా. 132

చ. అనియతియన్నభర్తకది యచ్చెరువయ్యెను భార్యచర్యయే
మనవలెమిన్నువ్రక్కలయి యద్దిశిరంబునఁ గూలినట్టులై
కనఁగననాల్కయెండెవడఁ కంగఁదొడంగెను గాలులేదియొ
ట్లనుటుచితంబొయెన్నమది యన్నదిసున్నయినిల్చె బొమ్మయై. 133

ఉ. ఆయతిపల్కెడిన్మరల నమ్మరొగంగరు నీకతమ్ముఁనం
ఛాయనిదుఃఖమేటికిడఁ బాల్పడెదమ్మ యథేచ్ఛనుండుపో

నీయఘమీ మొకందుమది నిల్కడచిక్కనటిట్టి చేష్టలం
జేయకుమీశ్వరుండితఁడె చేర్చెడినీకు సమస్తసౌఖ్యముల్. 134

మ. అనుమానంబది యేలయేమనఁగలే నట్లుందువూహింపనేఁ
జనెదనెల్లెమ్మనిలేవఁబోఁబలియనె న్నావిమీమహాత్మాయిఁక
న్నినితిన్నేను బహిష్కరింపకెటుల న్విశ్వాసముంతున్వథే
చ్ఛనెతానుండఁగనిండి దిల్లువిడువ న్యాసింతునంచీడిచెన్. 135

మ. ఇఁకనేమున్నది యున్నప్రాణముసహా యేమయ్యెనోపీనుఁగై
పాగిలెన్మూర్ఛిలెఁ గొంతసేపటికిఁ దీర్పుం జెందుజ్ఞానంబూచి
కఁకనారోతపనుత్తర్య జింతుసనియు న్గంగానదీస్నానమొ
ప్పగభర్తన్జతఁగూడి చేయుదునసెం బుణ్యాత్మయైయున్ననే 136

ఉ. అంతటనయ్యతీంద్రుఁడల హంసవచించిన దాదిగాఁగబ
ల్వింతలిటాంద్రువల్కఁదన విన్నదియంతముగాఁగ సర్వము
న్నంతనచేసిచెప్పవిని జంకిఁకఁబట్టఁగరానిదొడున
త్యంతధృఢత్వమేర్పడియెఁ దత్పతికయ్యతినమ్మ నంతగన్. 137

తే-గీ. ఐనయతియింకదానియా స్యంబుఁగాంచి, పలుకుతప్పినసీతల పగులునినియె
భక్తితోయతిపతులకు వరుసమ్రొక్కి, గట్టిబాసలహస్తోద కమదొసంగె. 138

ఉ. ఆతనిసత్కృపామతికి నయ్యుపకారమతీత నిష్ఠతోఁ
జేఁతకుభర్తమ్రొక్కి పరి శీలనతోనిఁకనుందునంచనెం
బ్రీతినదెల్లగంగకని ప్రేమబయల్వెలిపంగ నెంచియ
ప్ఠాతఁడువోవిమాన మొకఁ డంపెనువారలయింటి చెంతకున్. 139

సీ. పటుసువర్ణముతోడ బహురత్నములతోడ, మీఱినకాంతిని మెఱయునదియు
ప్రక్కలంబైఁదగు పటిమాన్వితానేక, పతుధ్వజంబుల వఱలునదియు
ఆటపాటలనొప్పు నచ్చరల్గంధర్వ, లతిశయించిబయల నలరునదియు
వలగొనిదేవయో నులుదండపాణులై, పలుపరాకులు దెల్పఁ బరగునదియు

తే-గీ. భానుమండలమదెడిగ్గఁ బడెడినను చు, భూమి నెల్లరుఁగన్గొనఁ బూనునదియు
నూరివారందఱచ్చెరు వొందునదియు, నగువిమానంబుపైనుండి యచటవ్రాలె.

కం. అదిగంగాకృతమనుచును, విదితంబయ్యెడినిగాన విహ్వాలభక్తి
న్మొదలిడిరెదుటఁగల్లట్టే, యెదనమ్మకముయతినుతించె నీశ్వరిగంగన్. 141

శా. శ్రీకంఠేశజటావిలాసినిమరు త్సేవ్యావియద్గామినీ
రాకాసోమసమాన సౌమ్యవర్ధనా రాజీవపత్త్రేక్షణా

నీకారుణ్యమహీన సౌఖ్యములనీ నేనైనదాఁగాదెలో
కైకస్తస్యచిదాకృతీభగవతీ గంగాంబభాగీరథీ. 142

శా. శ్రీరంజిల్లఁగ దేవదేవుశిరమే సింహాసనంబౌటఁద
ద్వీరాగ్రేసరుకన్న మేటివనఁగా వేద్యంబదేయౌఁగదా
సారంబింతటిదున్న నైజమగునీ సత్వాఢ్యతన్భక్తులం
గారుణ్యంబునఁ బ్రోచుచుండెదుసదా గంగాంబభాగీరథీ. 143

శా. శ్రీవిష్ణ్వంఘ్రిపయోరుహ ప్రభవభా షేశాంగభూసోదరీ
ధీవిస్తీర్ణముదేహశోభగలిదే దివ్యప్రభన్రంజిలు
న్దేవీయేడవసింతో కాంచెదవుసంస్థదేహంబులేకంతయుం
గావన్నన్నెటుచూచి తన్మయిపుడో గంగాంబభాగీరథీ. 144

తే-గీ. అనినుతించిసురాహూతుఁడగుచునెక్కె, యతివిమానంబుమదిలోన ననికొని
అంచదీవినిగనవలె నంచుఁగాన, దానికాపేరువచ్చెన తఁడటడిగ్గె. [యొను.

కం. యతిఘనతవిదితమయ్యెను, సతిబహుబుద్ధిమతియైయు జతగాంద్రవిడెం
బతిమతికనుగతయయ్యెను, గతినొందెందుదకునావె గంగాంబకృపన్. 146

చ. తనకునతీతపుణ్యవర దాయినియాం చెలుఁగంగనాటచే
తనుయతియాస్థఁగోరికొని తాదిగెఁగృష్ణపయోధి సంగమిం
చినయలయంచదీవినటఁ జేసెనుస్నానముఁ గృష్ణనెంతయో
వినయముతోనుతించితగు వేడ్కవిమానమునెక్కి యేగుడున్. 147

కం. కైలాసముకాన్పించెం, గాలాంతకదర్శనంబుఁ గావించెనుదాఁ
జాలఁగనతనినుతించెను, ఫాలాక్షుసమానవైభ వంబుంగాంచెన్. 148

కం. ఇదికృష్ణామాహాత్మ్యము, మొదలిడితుదవఱకుఁజదువ ముజ్జగములలో
సదమలకీర్తివహింపఁగ, నొదవెడిసంపదలుకలుగు నుత్తమగతియున్. 149

## ర థ బం ధ కం ద ము.

శ్రీదాకృష్ణాస్తోత్ర, హ్లాదాహకదివ్యనవ్య శమదానిత్యా
మోదితభక్తాజ్ఞానా, హ్లాదమయానిఖిలమహిత మానీమనమే. 150

( ఇది తొమ్మిదిగదుల చౌకపు రథమున నిముడును. ఇందు 'శ్రీకృష్ణానది మహిమ
మే' అనినడిమిబారునఁ గాన్పించును )

## బహువిధపద పద్యానేకసహస్ర గర్భితాద్భుత సీసరాజేంద్రము.

ధరధరత్వరగాను దఱిఁగనితగుమయ్యా, కొఱఁతలువాపఁగ వరములిమ్మ
గురువరగుఱిగాను గుఱుతుననిలుమయ్యా, యరులనుమాపఁగ మఱుఁగునిమ్మ
స్మరహరసరిగాను జరణమూలిడుమయ్యా, కరములుచాపఁగ శరణమిమ్మ
సురవరచోరఁగాను సుగతినొసఁగుమయ్యా, కరుణనుజూపఁగ సురుచినిమ్మ
చంద్రసూర్యాగ్నిలోచన సమరభీమ, సాంద్రకారుణ్యభూషణ శమితకామ
అంద్రుసర్వేశ్వరాయని యమితనామ, కంద్రుదేవాళినింగన కముగసోమ.

### ఇందలిసమచిత్ర పదములు.

త్వరగాతగుమా, కొఱఁతలువాపఁగ, గుఱిగానిలుమా, అరులనుమాపఁగ.
త్వరగాతగుమా, వరములనిమ్మా, గుఱిగానిలుమా, మఱుఁగునునిమ్మా.
తఱిఁగనితగుమా, త్వరగాధరధర, గుఱుతుననిలుమా, గుఱిగాగురువర.
తఱిఁగనితగుమా. ధరధరత్వరగా, గుఱుతుననిలుమా, గురువరగుఱిగా.
తఱిఁగనితగుమా, కొఱఁతలువాపఁగ, గుఱుతుననిలుమా, అరులనుమాపఁగ.
తఱిఁగనితగుమా, వరములనిమ్మా, గుఱుతుననిలుమా, మఱుఁగునునిమ్మా.
తఱిఁగనిధరధర, త్వరగాఁదగుమా, గుఱుతునగురువర, గుఱిగానిలుమా.
తఱిఁగనిత్వరగా, ధరధరతగుమా, గుఱుతునగుఱిగా, గురువరనిలుమా.
కొఱఁతలువాపవె, ధరధరత్వరగా, అరులనుమాపవె, గురువరగుఱిగా.
కొఱఁతలువాపవె, త్వరగాధరధర, అరులనుమాపవె, గుఱిగాగురువర.
కొఱఁతలువాపఁగఁ, ద్వరగాఁదగుమా, అరులనుమాపఁగ, గుఱిగానిలుమా.
కొఱఁతలువాపఁగ, ధరధరతగుమా, అరులనుమాపఁగ, గురువరనిలుమా.
కొఱఁతలువాపఁగఁ, దఱిఁగనితగుమా, అరులనుమాపఁగ, గుఱుతుననిలుమా.
కొఱఁతలువాపఁగ, వరమీఁదగుమా, అరులనుమాపఁగ, మఱుఁగీనిలుమా.

ఇట్లుశతాధికసంఖ్యగా నేఱనగును. అన్నియువింతరీతులఁ జాడనగును.

### ఇందలి చంపకమాల.

వరములనిమ్మయాకొఱఁత వాపఁగ నేత్వర గంధరాధరా
మఱుఁగునునిమ్మయాయరుల మాపఁగ నేగుఱిగా గురూత్తమా
శరణమునిమ్మయాకరము చాపఁగ నేసరిగా స్మరాపహా
సురుచినినిమ్మయాకరుణఁ జూపఁగ నేచోరఁగా సురాధిపా
ఇదియే యెనిమిది చంపకమాలలగును.

## ఇందలి కందములు.

1. ధరధరతతిఁగనితగుమయ, వరములనిమ్మిత్వరగాను బాపఁగఁగొఱఁతల్
గురువరగుఱుతువనిలుమయ, మఱుఁగునునిమ్మికుటిగాను మాపఁగనరులన్.

2. స్మరహరచరణములిడుమయ, శరణమునిమ్మిసరిగాను జాపఁగఁగరముల్
సురవరసురభినొసఁగుమయ, సురుచినినిమ్మిచొరఁగాను జూపఁగఁగరుణన్.

3. ధరధరకొఱఁతలువాపఁగఁ, ద్వరగానొవరములీయఁ దతిఁగనితగుమా
గురువరయరులనుమాపఁగ, గుటిగానొమఱుఁగునీయ గుఱుతువనిలుమా.

4. స్మరహరకరములుచాపఁగ, సరిగానొశరణమీయఁ జరణములిడుమా
సురవరకరుణనుజూపఁగఁ, జొరఁగానొసురుచినీయ సురభినొసఁగుమా.

5. త్వరగానువరములిమ్మా, ధరధరపాపఁగఁగొఱఁతలు తతిఁగనితగుమా
గుటిగానుమఱుఁగునిమ్మా, గురువరమాపఁగనరులను గుఱుతుననిలుమా

6. సరిగానుశరణమిమ్మా, స్మరహరచాపఁగఁగరములు చరణములిడుమా
చొరగానుసురుచినిమ్మా, సురవరచూపఁగగరుణను సురభినొసఁగుమా.

7. కొఱఁతలువాపఁగధరధర, త్వరగానేవరములిమ్మి తతిఁగనితగుమీ
అరులనుమాపఁగగురువర, గుటిగానేమఱుఁగునిమ్మి గుఱుతుననిలుమీ.

8. కరములుచాపఁగస్మరహర, సరిగానేశరణమిమ్మి చరణములిడుమీ
కరుణనుజూపఁగసురవర, చొరఁగానేసురుచినిమ్మి సురభినొసఁగుమీ.

9. కొఱఁతలువాపఁగఁద్వరగా, ధరధరయిమ్మీవరములు తతిఁగనితగుమీ
అరులనుమాపఁగగుటిగా, గురువరయిమ్మీమఱుఁగును గుఱుతుననిలుమీ.

10. కరములుచాపఁగసరిగా, స్మరహరయిమ్మీశరణము చరణములిడుమీ
కరుణనుజూపఁగఁజొరఁగా, సురవరయిమ్మీసురుచిని సురభినొసఁగుమీ.

11. వరములనిమ్మీకొఱఁతలు, త్వరగాఁబాపఁగధరధర తతిఁగనితగుమీ
మఱుఁగునునిమ్మీయరులను, గుటిగామాపఁగగురువర గుఱుతుననిలుమీ.

12. శరణమునిమ్మీకరములు, సరిగాఁజాపఁగస్మరహర చరణములిడుమీ
సురుచినినిమ్మీకరుణను, జొరఁగాఁజూపఁగసురవర సురభినొసఁగుమీ.

13. వరములనిమ్మాపాపఁగఁ, ద్వరగాఁగొఱఁతలుధరధర తతిఁగనితగుమా
మఱుఁగునునిమ్మామాపఁగ, గుటిగానరులనుగురువర గుఱుతుననిలుమా.

14. శరణమునిమ్మాచాపఁగ, సరిగాఁగరములుస్మరహర చరణములిడుమా
సురుచినినిమ్మాచూపఁగఁ, జొరఁగాఁగరుణనుసురవర సురభినొసఁగుమా.

15. త్వరగాఁ దఱఁగనితగుమయ, వరములనిమ్మీ ధరధర పాపఁగఁ గొఱఁతల్
గుఱిగా గుఱుతుననిలుమయ, మఱుఁగుననిమ్మీ గురువర మాపఁగ నరులన్.
16. సరిగాఁ జరణములిడుమయ, శరణమునిమ్మీ స్మరహర చాపఁగఁ గరముల్
చోరఁగా సురభినొసఁగుమయ, సురుచిని నిమ్మీ సురవర చూపఁగఁ గరుణన్.
17. తఱఁగనితగుమయ త్వరగా, వరములనిమ్మీ ధరధర పాపఁగఁ గొఱఁతల్
గుఱుతుననిలుమయ గుఱిగా, మఱుఁగుననిమ్మీ గురువర మాపఁగ నరులన్.
18. చరణములిడుమయ సరిగా, శరణమునిమ్మీ స్మరహర చాపఁగఁ గరముల్
సురభినొసఁగుమయ చోరఁగా, సురుచిని నిమ్మీ సురవర చూపఁగఁ గరుణన్.
19. తఱఁగనితగుమయ ధరధర, వరములనిమ్మీ త్వరగను బాపఁగఁ గొఱఁతల్
గుఱుతుననిలుమయ గురువర, మఱుఁగుననిమ్మీ గుఱిగను మాపఁగ నరులన్.
20. చరణములిడుమయ స్మరహర, శరణమునిమ్మీ సరిగను జాపఁగఁ గరముల్
సురభినొసఁగుమయ సురవర, సురుచిని నిమ్మీ చోరఁగను జూపఁగఁ గరుణన్.

ఈపదిజోడులు నెనిమిదివందలు కందములగును ఇంకఁ గొన్నివందలుఁ బ్రస్తరింపనగు.

## ఇందలి ఆటవెలదులు.

1. ధరధర త్వరగానె తఱఁగనితగుమయ్య, కొఱఁతఁ బాపఁగాను వరములిమ్మి
గురువర గుఱిగానె గుఱుతుననిలుమయ్య, నరుల మాపఁగాను మఱుఁగునిమ్మి.
2. స్మరహర సరిగానె చరణములిడుమయ్య, కరముఁ జాపఁగాను శరణమిమ్మి
సురవర చోరఁగానె సురభినొసఁగుమయ్య, కరుణఁ జూపఁగాను సురుచినిమ్మి.
3. ధరధర త్వరగానె తఱఁగనితగుమయ్య, పాపఁగాను గొఱఁత వరములిమ్మి
గురువర గుఱిగానె గుఱుతుననిలుమయ్య, మాపఁగా నరుల మఱుఁగునిమ్మి.
4. స్మరహర సరిగానె చరణములిడుమయ్య, చాపఁగాను గరము శరణమిమ్మి
సురవర చోరఁగానె సురభినొసఁగుమయ్య, చూపఁగాను గరుణ సురుచినిమ్మి.
5. ధరధర త్వరగానె తఱఁగనితగుమయ్య, వరములిమ్మి కొఱఁత వాపఁగాను
గురువర గుఱిగానె గుఱుతుననిలుమయ్య, మఱుఁగునిమ్మి యరుల మాపఁగాను.
6. స్మరహర సరిగానె చరణములిడుమయ్య, శరణమిమ్మి కరముఁ జాపఁగాను
సురవర చోరఁగానె సురభినొసఁగుమయ్య, సురుచినిమ్మి కరుణఁ జూపఁగాను.
7. తఱఁగనితగుమయ్య ధరధర త్వరగను, వరములిమ్మి కొఱఁత వాపఁగాను
గుఱుతుననిలుమయ్య గురువర గుఱిగను, మఱుఁగునిమ్మి యరుల మాపఁగాను.
8. చరణములిడుమయ్య స్మరహర సరిగను, శరణమిమ్మి కరముఁ జాపఁగాను
సురభినొసఁగుమయ్య సురవర చోరఁగను, సురుచినిమ్మి కరుణఁ జూపఁగాను.

9. తఱిఁగనితగుమయ్య త్వరగనుధరధర, వరములిమ్ముకొఱఁత వాపఁగాను
గుఱుతుననిలుమయ్య గుఱిగనుగురువర, మఱుఁగునిమ్మయరుల మాపఁగాను.

10. చరణములిడుమయ్య సరిగనుస్మరహర, శరణమిమ్ముకరముఁ జాపఁగాను
సురభినొసఁగుమయ్య చొరగనుసురవర, సురుచినిమ్ముకరుణఁ జూపఁగాను.

ఈరైదుజోడులును గంధములవలెనె నాల్గువందలగును
అమరింపఁగలవీలుకొలది నింకిన్నియయిన నేర్పడునట్లు కానవచ్చును.

ఇందలి తేటగీతులు.

1. కొఱఁతవాపఁగధరధర వరములిమ్ము, అరులమాపఁగగురువర మఱుఁగునిమ్ము
కరముఁజాపఁగస్మరహర శరణమిమ్ము, కరుణఁజూపఁగసురవర సురుచినిమ్ము.
2. కొఱఁతవాపఁగఁద్వరగను వరములిమ్ము, అరులమాపఁగగుఱిగను మఱుఁగునిమ్ము
కరముఁజాపఁగసరిగను శరణమిమ్ము, కరుణఁజూపఁగఁజొరఁగను సురుచినిమ్ము.
3. వరములిమ్మయ్యధరధర పాపఁగొఱఁత, మఱుఁగునిమ్మయ్యగురువర మాపనరుల
శరణమిమ్మయ్యస్మరహర చాపఁగరము, సురుచినిమ్మయ్యసురవర చూపఁగరుణ.
4. వరములిమ్మయ్యత్వరగను బాపఁగొఱఁత, మఱుఁగునిమ్మయ్యగుఱిగను మాపనరుల
శరణమిమ్మయ్యసరిగను జాపఁగరము, సురుచినిమ్మయ్యచొరఁగను జూపఁగరుణ.
5. వరములిమ్మయ్యకొఱఁతలు వాపఁగాను, మఱుఁగునిమ్మయ్యయరులనుమాపఁగాను,
శరణమిమ్మయ్యకరములు చాపఁగాను, సురుచినిమ్మయ్యకరుణను జూపఁగాను.
6. పాపఁగొఱఁతలుధరధర వరములిమ్ము, మాపనరులనుగురువర మఱుఁగునిమ్ము
చాపఁగరములు స్మరహర శరణమిమ్ము, చూపఁగరుణసురవర సురుచినిమ్ము.
7. పాపఁగొఱఁతలుత్వరగను వరములిమ్ము, మాపనరులనుగుఱిగను మఱుఁగునిమ్ము.
చాపఁగరములుసరిగను శరణమిమ్ము, చూపఁగరుణనుజొరఁగను సురుచినిమ్ము.
8. పాపఁగాఁగొఱఁతలనిమ్ము వరములయ్య, మాపఁగానరులనునిమ్ము మఱుఁగునయ్య
చాపఁగాఁగరములనిమ్ము శరణమయ్య, చూపఁగాఁగరుణనునిమ్ము సురుచినయ్య.

ఇవిచంపకమాలల లెక్కనయినను ఎనిమిదెనుముదు లఱువదినాలుగగునుగదా.

ఇంకనిందలి ద్విపదలు (ఇవిపలు తెగలపాటలగుఁగదా.)

1. ధరధరత్వరగాను తఱిఁగనితగుమ, గురువరగుఱిగాను గుఱుతుననిలుమ.
2. స్మరహరసరిగాను జరణములిడుమ, సురవరచొరఁగాను సురభినొసఁగుమ.
3. త్వరగానుధరధర తఱిఁగనితగుమ, గుఱిగానుగురువర గుఱుతుననిలుమ.
4. సరిగానుస్మరహర, చరణములిడుమ, చొరఁగానుసురవర సురభినొసఁగుమ.
5. తఱిఁగనితగుమయ్య ధరధరత్వరగ, గుఱుతుననిలుమయ్య గురువరగుఱిగ.

6. చరణములిడుమయ్య స్మరహారసరిఁగ, సురభినోసఁగుమయ్య సురవరచోరఁగ.
7. పాపఁగఁగొఱఁతలు వరములనిమ్మీ, మాపఁగనరులను మఱుఁగునునిమ్మీ.
8. చాపఁగఁగరములు శరణమునిమ్మీ, చూపఁగఁగరుణను సురుచినినిమ్మీ.
9. వరములనిమ్మయ్య పాపఁగఁగొఱత, మఱుఁగునునిమ్మయ్య మాపఁగనరుల.
10. శరణమునిమ్మయ్య చాపఁగఁగరము, సురుచినినిమ్మయ్య చూపఁగఁగరుణ.

## ఇందలి లాలి పాట.

చంద్రసూర్యాగ్నిలో, చనసమరభీమ। సాంద్రకారుణ్యభూ, మణశమితకామ
అంద్రుసర్వేశ్వరా, యనియమితనామ। కంద్రుదేవాళినిం, గనకముగసోఁపు లాలి

పై ద్విపదలజోళ్లు దీనికింజరణములుఁగ సయితేమగును.

## ఇంకనిందలి 1. హయప్రచార రగడ.

కొఱఁతవాప వరములిమ్ము, అఘలమాప మఱుఁగునిమ్ము
కరముఁజాప శరణమిమ్ము, కరుణఁజూప సురుచినిమ్ము.

## 2. తురగవల్గన రగడ.

వరములిమ్మిపాపఁగొఱఁతే మఱుఁగునిమ్మిమాపనరుల
శరణమిమ్మిచాపఁగరము సురుచినిమ్మిచూపఁగరుణ.

## 3. విజయమంగళ రగడ.

ధరధరత్వరఁదఱఁగనితగు, వరములీయఁగొఱఁతవాప
గురువరగుఱిగుఱుతునిలు, మఱుగునీయనరులమాప
స్మరహరసరిచరణములిడు, శరణమీయఁగరముఁజాప
సురవరచోరసురభినోసఁగు, సురుచినీయఁగరుణఁజూప.

## 4. ద్విరదగతి రగడ.

ధరధరాత్వరగాను, తఱఁగనియుఁదగుమయ్య గురువరగుఱిగాను, గుఱుతునను నిలుమయ్య
స్మరహరాసరిగాను, జరణములనిడుమయ్య సురవరాచోరఁగాను, సురభినినోసఁగుమయ్య.

## 5. విజయభద్ర రగడ.

ధరధరాత్వరగాను దఱఁగనియుదగుమయ్య గురువరాగుఱిగాను గుఱుతునను నిలుమయ్య
స్మరహరాసరిగాను జరణమువిడుమయ్య సురవరాచోరఁగాను సురభినినోసఁగుమయ్య.

## 6. మధురగతి రగడ.

ధరధరత్వరగాఁ, దఱఁగనితగుమా, గురువరగుఱిగా, గుఱుతునిలుమా
స్మరహరసరిగాఁ జరణములిడుమా, సురవరచోరఁగా, సురుచినోసఁగుమా.

## 7. హరిగతి రగడ.

కోఁతలు వాపఁగ వరములనిమ్మా అరులను మాపఁగ మఱుఁగును నిమ్మా
కరములు చాపఁగ శరణము నిమ్మా కరుణను జూపఁగ సురుచిని నిమ్మా.

## 8. హరిణగతి రగడ.

ధరధరత్వరగఁ దలఁగనితగుమ, గురువగుచిగ, గుఱుతుపనిలుమ
స్మరహరసరిగఁ, జరణములిడుమ, సురవరచోరఁగ, సురుచివొసఁగుమ.

## 9. వృషభగతి రగడ.

కోఁతలు వాప వరములనిమ్మ అరులను మాప మఱుఁగును నిమ్మ
కరములు చాప శరణము నిమ్మ, కరుణను జూప సురుచిని నిమ్మ.

ఇంక నిందలి సీసములకు మాదిరికై మొదటి పాదము.

1. త్వరగాను ధరధర తలఁగనితగుమయ్య, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
2. ధరధర తలఁగని త్వరగాను దగుమయ్య, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
3. త్వరగాను దలఁగని ధరధర తగుమయ్య, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
4. తలఁగని ధరధర త్వరగాను దగుమయ్య, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
5. తలఁగని త్వరగాను ధరధర తగుమయ్య, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
6. తలఁగని తగుమయ్య ధరధర త్వరగాను, కోఁతలు వాపఁగ వరములిమ్మ.
7. తలఁగని తగుమయ్య త్వరగాను ధరధర, కోఁతలు వాపఁగ వరములిమ్మ
8. ధరధర త్వరగాను దలఁగని తగుమయ్య, పాపఁగఁ గోఁతలు వరములిమ్మ.
9. ధరధర త్వరగాను దలఁగని తగుమయ్య, వరములనిమ్మయ్య కోఁతవాప.
10. ధరధర త్వరగాను దలఁగని తగుమయ్య, వరములనిమ్మయ్య పాపఁగోఁత.
11. కోఁతలు వాపఁగ వరములనిమ్మయ్య, తలఁగని తగుమయ్య ధరధరత్వర.
12. పాపఁగఁ గోఁతలు వరములనిమ్మయ్య, తలఁగని తగుమయ్య ధరధరత్వర.
13. వరములనిమ్మయ్య కోఁతలు వాపఁగఁ, దలఁగని తగుమయ్య ధరధరత్వర,
14. వరములనిమ్మయ్య పాపఁగఁ గోఁతలు, తలఁగని తగుమయ్య ధరధరత్వర.
15. వరములనిమ్మయ్య పాపఁగఁ గోఁతలు, తలఁగని తగుమయ్య త్వరధరధర.

(ప్రస్తరించిన కొలఁదిని రగడలు వేలును సీసములు వందలును బయల్వెడలును.)

## కందము.

శ్రీదక్షిణాస్యకరుణా, సాదితకవితావిలాసి చతురతవ్రాసెన్
సాదెళ్ల పురుషోత్తముఁ, డాదటఁ గృష్ణకథ సాలుగాశ్వాసములన్.

శ్రీమేధాదక్షిణామూర్తీశ్వరార్పణమస్తు.

---

# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 17 | మోధుక | మోకక |
| 3 | 3 | ైశ్యకా | శ్యకా |
| 8 | 24 | సుకర | సుకృత |
| 10 | 13 | రూవ | రూప |
| 19 | 7 | పృథ్వి | పృథ్వి |
| 21 | 14 | యెద్చంగు | యెద్చగు |
| 30 | 29 | ఘృష్ట | ఘుష్ట |
| 32 | 6 | జూటు | జాటు |
| ,, | 14 | ఫేద | ఖేద |
| 37 | 8 | శ్వాలకు | శ్యాలకు |
| ,, | 12 | యొప్పడు | యొప్పడు |
| 40 | 2 | దేవతు | దేవత |
| 44 | 14 | రథ | గథ |
| 45 | 14 | రింవ | రింప |
| 46 | 23 | జీవి | జీవ |
| 47 | 20 | తేరద | తేఱద |
| ,, | 21 | మారెద | మాఱెద |
| ,, | ,, | మాఘతు | మాఋతు |
| 51 | 4 | థముల్ | ధముల్ |
| 52 | 30 | సాంగ | సాగ |
| 56 | 27 | వేణాణ్ | వేణణ్ |
| 59 | 22 | కాంత | సంత |
| 63 | 5 | డంట్టి | డంబట్టి |
| 64 | 13 | కర్ధ | కర్థ |
| 66 | ,, | తీంద్రదు | తీంద్రదు |

కృష్ణాజిల్లా మచిలీపట్టణమునందు

# నాదెళ్ల పురుషోత్తమ కవిగారి యొద్దను

వెలకుదొరకు పుస్తకములు.

## రు 2-0-0 వేమనసూక్తి రత్నాకరము.

ఇన్ని వేమనపద్యాలు లోకములో మఱెక్కడనుఁజిక్కవు. ఇందు 4085 పద్యాలున్నవి. అన్నియు సలక్షణముగా దిద్దుబాటు పొందియున్నవి. పైగా వేమన్నగారి చిత్ర చరిత్రము తేటతెలుఁగున వ్రాయఁబడి అందు బొమ్మలపటాలు కూడఁ జేర్పఁబడి ఈ పుస్తకము మొదట పెట్టఁబడియున్నది. కుప్పలుగా తప్పులుండిన 3 వేల పద్యాలబుక్కుమాత్రమే రు 2 వెలగదా. ఇంతటి అనుకూలగ్రంథము ఇంతచవకగా దొరకుట ఎంతో లాభముకాదా?

## రు 2-0-0 పురుషోత్తమ కవీయము.

ఇదియొక క్రొత్తమాదిరి నిఘంటువు. ఇందు 3 అంతర్భాగములున్నవి.

(1) ఒక వికృతిపదమును దానిరూపాంతరము లన్నియునుండి అంతట దానిప్రకృతి రూపపదముండి పిమ్మట అర్థముండును. ఇది ప్రకృతిరూపప్రకాశిక.

(2) ఒక ప్రకృతిపదమును దాని రూపాంతరము లన్నియునుండి అంతట దానివికృతి రూపపదముండి పిమ్మట అర్థముండును. ఇది వికృతిరూపచంద్రిక.

(3) అట్లు ప్రకృతి వికృతి రూపములు లేకుండెడి తత్సమదేశ్యపదములన్నియుఁ గ్రమముగానుండి వాని రూపాంతరములుండి అర్థముండును. ఇది అన్యరూప దీపిక. ఇందు మొదటిభాగపు బనిమాత్రము వైకృతిదీపికయను పేరితో పూర్వము శబ్దరత్నాకర గ్రంథకర్తయగు బ. సీతారామాచార్యులవారు ప్రకటించిరిగాని అందువారు సుమారు 2½ వేల పదములుమాత్రమే ఏరిరి. ఇపుడాయొక్క భాగమె సుమారు 5 వేలుపదాలేరఁబడినవి. మాతృభాషను అభివృద్ధిచేసి కొనఁగోరువారందఱియింటను తప్పకయీప్రతియొకటి యుండఁదగ్గది.

## రు 1-8-0 అద్భుతోత్తరరామాయణము.

సీతారాముల పూర్వజన్మవృత్తములు, నారదుఁడు వారికిచ్చిన శాపవివరములు, రామాయణకథ, దశముఖ సంహారానంతరమున సహస్రముఖ రావణుఁడున్నట్లు రాముఁడు తెలిసికొన్న వానిపైదండెత్తి వాఁడుతప్ప మిగిలిన అందరినిసంహరించియు, రాముఁడువాని చేత నేటువడి మూర్ఛిల్లఁగా సీత ఆరావణుని జంపుట, రాముని బ్రహ్మబ్రతికింపఁగా లేచి

సీతను స్తుతించుట. అనువింతకథగల 7 ఆశ్వాసముల ప్రబంధము. చతుర్విధకవితాచాతుర్యముకలది. గర్భకవిత్వమున లోకములో సాటియేలేనిది. బహుపండితులు దీనినాదరించినది దీని మొదట ముద్రింపఁబడియున్నది. దీని 3 వాశ్వాసము B. A. కు టెక్స్టుగాయ్యెను.

రు 1 - 0 - 0 గురుభక్తి ప్రభావము.

దీపకుఁడను చిన్నవాఁడు మాతాపితృ గురుభక్తిచేతనే తరించిసిద్ధుఁడయినకథ. మనుష్యున కవసరమైన ధర్మములన్నియుఁ జక్కఁగాఁగలవు. విశ్వేశ్వర బిందు మాధవులతో దీపకుఁడు ముచ్చటించినదెంతయో ముచ్చటగానుండును. 6 ఆశ్వాసముల నిర్వచనప్రబంధము. కవితా చతురిమముంగలదు. కడుసులభశైలి. బాలురకును అర్థమగును.

రు 0 - 12 - 0 కృష్ణానదీ మాహాత్మ్యము.

శాల్గాశ్వాసముల నిర్వచనప్రబంధము పూర్వార్థమున కృష్ణయేర్పాటును దత్తీరస్థక్షేత్రమహిమాదులుండును గాని ఉత్తరార్థమునఁదత్సంబంధములైనవే 4 కథలువిపులముగాను ముద్దుగాను వ్రాయఁబడినందున ఖులాసాగాఁ జదివికొదగిన గ్రంథమయినది. గర్భకవిత్వమునం దద్భుతోత్తరరామాయణమునకు సాటిరాఁదగినది. కృష్ణ సర్వోత్కృష్టయగుఁగాననిదిపావనమైనది.

రు 0 - 12 - 0 కురంగేశ్వర చరిత్రము.

మాయలేడియైన మారీచుని శ్రీరాముడు సంహరించి తద్దోషపరిహారమునకై కురంగేశ్వర ప్రతిష్ఠచేసెను. అట్టికోరంగిక్షేత్రమున జరిగిన యొకచక్కనికథయుంగలది. కవిత్వముచాలముద్దుగానుండును.

రు 0 - 12 - 0 చంద్రహాస నాటకము.

దిక్కులేక నిరుపేదయై యుండియు దండివాఁడొకఁడు తన్నుజంపింపగాచి యున్నను ఆచారినిబడక దైవయోగమున పర్థిల్లి చక్రవర్తియేయైన చంద్రహాసునికథ చాల మంచిదని భాషాంతరీకరణముకూడ నైనది. బహు నీతిబోధకము అమూలాగ్రముగఁగథ యంతయుంగద్దు పదియంకములున్నను నాటకము చిన్నది. ఇంకెంతచిన్నదిగనైనఁ జేసికొవీలునున్నది. పద్యములు చాల సులభముగా నుండును.

రు 0 - 12 - 0 ద్రౌపదీ వస్త్రాపహరణము.

ఇది ప్రసిద్ధమయిన భారతకథా నాటకము. పద్యములెకాక కీర్తనలు సహాకలవు. చాల మనోహరముగనుండును రసవంతము.

రు 0 - 12 - 0 హిందూస్థానీ రామదాసచరిత్రము. (అపూర్వము)

(కడువింతగనుండు హిందూస్థానీ నాటకము) తెలుగులిపిత్రోనుండి భావరాని

వారను ధారాళముగాఁ జదువఁదగినట్టిగుణ్ములఁ గలిగియున్నది. సంస్కృతపదములెచ్చుగ నుండుటచేఁజక్కఁగా నర్థమగును. భాష నేర్చుకోఁగోరువారికి సులభముగ నలవడును. వృత్తములు బైదులుటపాలును మనోరంజకములు. వచనమయినను తమాషానియమములుండ బట్టి యుల్లాసప్రదమగును. పూర్వమిది నాటకులు ప్రదర్శించినపుడు వందలకొలఁదిగ ధన మువచ్చెడిది. దీనిరసము అనుభవించినకొలఁదిని అభిరుచినిగలిగించుచుండును.

## రు 0 - 8 - 0 ధార్మికోల్లాసిని.

60 వేల ర్పు. ఆస్తిని బహువిధధర్మములకు వినియోగపఱుపఁజెప్పిన తమ్మన పిచ్చ య్య అను ధార్మికుని మరణశాసనమును పద్యకావ్యముగ అతనిసచ్చరిత్రమునుగలది. చరిత్ర లో దేశగ్రామపుర వర్ణనలు కడురమ్యములు. సమయోచిత ధర్మబోధచాలకొనియాడఁదగి నది. తేలికశైలికలది. రెండుజాతకముల ఫలాలు తజ్జ్ఞులకు బహురుచ్యములు.

## రు 0 - 8 - 0 అష్టావక్రగీతలు.

అష్టావక్రమహాముని జనకులవారి కుపదేశించిన కథాక్రమము ముందుండి పిమ్మట శ్లోకము గీతపద్యమువంతున గీతలతర్జుమాయునుండును.

## రు 0 - 8 - 0 యాదవాద్రీశోపాఖ్యానము.

శ్రీరామానుజులవారు డిల్లీమీఁదికి దండెత్తిపోయి మేలుకోట నాథునిదోడ్తేగా నపుడు బీబీనాంచారమ్మ పెండ్లియైనకథ. తేలికశైలి.

## రు 0 - 8 - 0 ప్రసంగవచన హరిశ్చంద్ర నాటకము.

పాత్రోచితజాతీయములుకలది. బహురసవంతము, సుప్రసిద్ధము, ముద్దుగానుండు నగుట మరల ముద్రింపఁబడియున్నది.

## రు 0 - 6 - 0 స్త్రీలమీటింగు నాటి హరికథ.

ఇది చాలలోకప్రసిద్ధిని బడసినది. తరుణానంద మొసఁగుటేకాక చిరానుకూల్య ను గల్గించును. స్త్రీస్వేచ్ఛతగదను నీతింజెప్పును.

## రు 0 - 6 - 0 సోమేశ్వరీయము.

భక్తియు నీతియుం గలిగి వివిధ వృత్తములు చిత్రకవిత్వముం గలట్టి యొక చాటు ప్రబంధము.

## రు 0 - 6 - 0 మాహేంద్రపురాణము.

మాసివాయనములనోముకథ 2 ఆశ్వాసముల ప్రబంధము చక్కనిశైలి.

## రు 0 - 6 - 0 అద్భుతోత్తర రామాయణ తృతీయాశ్వాసము.

ఇది 1911 సం B. A. పరీక్షకు టెక్స్టుగఁ విడఁదీయబడెను. ప్రత్యేకోపాఖ్యానము

## రు 0 - 6 - 0 వేమనయోగి చరిత్రము.

నడుమనడుమ కథాసందర్భపు పటములువేయుచు లేటతెలుగున వ్రాయఁబడియున్న వచనకావ్యము. వింతకథ తేలికగనున్నది.

రు 0 - 5 - 0 700 యుక్తిలెక్కలుగల 'అంకజ్యోత్స్న' (బహుప్రసిద్ధమైనది.)

రు 0 - 5 - 0 ప్రైమరీపరీక్ష లెక్కలపుస్తకము (48 ఎగ్జామినేషన్ పేపరున్నవి)

రు 0 - 3 - 0 అజ్ఞానధ్వంసిని (మాతాపిత్రాది వర్ణనదేవప్రార్థనమును గలపద్యకావ్యము. ఇదిబాలురు నిత్య పారాయణము చేయుదురేని వారియజ్ఞానము నుధ్వంసమేచేయును.)

రు 0 - 3 - 0 చెన్నపురిరాజధాని భూగోళము (జిల్లాలమార్పునకు దర్కిలాది.)

రు 0 - 2 - 0 సౌఖ్యవిషయగుచ్ఛము (మున్నుప్రసిద్ధిఁజెందిన సంగ్రహపుప్రైజీను.

రు 0 - 2 - 0 చిన్నతరగతుల లెక్కల పుస్తకము.

రు 0 - 2 - 0 అక్షరాభ్యాసము ( అక్షరములు గుణితములు అనాయాసముగాను వేగముగాను రావీలయినది.)

రు 0 - 2 - 0 ముక్తికాంతామణీ శతకము (గ్రంథకర్త దీనిని మాతృస్తవము జన్మాత్మస్తవమునుగాఁజెప్పియున్నాఁడు. కొన్నిపద్యములుద్వ్యర్థులు భక్తియు నీతియుఁగలది లోకోక్తులుచాలఁగల 108 మత్తేభశార్దులవిక్రీడిత వృత్తములును 20 సంస్కృతప్రార్థనా శ్లోకములుగలవు.

రు 0 - 2 - 0 సర్వమతభక్తానుకూల కీర్తనావళి (బ్రహ్మసమాజము వారికిని మిగులనుపయుక్తము) (ఎంతోచక్కని వింతమట్లుకలది.)

రు 0 - 1 - 0 కీర్తనలు, హారతులు, పాటలు (తటాలున పాడుకోఁగల సౌకర్యములు గలది.

రు 0 - 1 - 0 మనోహర సోమేశ్వరశతకము (108 పసందైన సీసపద్యములుగలది

రు 0 - 1 - 0 పూర్వకర్మ శతకము (రామాయణ భారతాది గ్రంథాంశములుగలది. 108 చంపకోత్పలమాలలు.)

రు 0 - 1 - 0 జార్జిప్రభు పట్టాభిషేకము (వివిధవృత్తవిలసితము.)

ఇందేయొకటికాని యే కొన్నిటినైనం జేర్చికాని విడివిడిగనొకమారె కొనువారికమీషన్ విడివిగనీయఁబడును. అదిరకములను బట్టి భేదపడియుండుంగాన వ్రాసి తెలిసికోనగును.

2-0-0 వేమనసూక్తిరత్నాకరము (4035 నిర్దుష్టపద్యములును బొమ్మలుగల చరిత్రయు)
2-0-0 పురుషోత్తమకవీయము (శబ్దప్రకృతి వికృతిరూపాంతరములఁ దెల్పునిఘంటువు)
1-8-0 అద్భుతోత్తరరామాయణము (సహస్రముఖరావణవధ, అద్భుతకవిత్వముగలది)
1-0-0 గురుభక్తిప్రభావము (ముద్దగుకథ, నీతులపుట్ట, కడుసులభశైలి ప్రబంధము)
0-12-0 కృష్ణానదీమాహాత్మ్యము (వింతయుపాఖ్యానములు చాలగలమనోహరప్రబంధము)
0-12-0 కురంగేశ్వరచరిత్రము (వింతకథ, చక్కనిశైలిగల యొకప్రబంధము)
0-12-0 చంద్రహాస చరిత్రము (10 అంకముల నాటకము, పద్యగద్యాత్మకము సులభశైలి)
0-12-0 ద్రౌపదీవస్త్రాపహరణము (భారతకథానాటకము, కీర్తనలుఁబద్యములు రమ్యములు)
0-12-0 హిందూస్థానీ రామదాసచరిత్రము (తెలుగులిపి, అపూర్వ నాటకము, చాల తేలిక)
0-8-0 ధార్మికోల్లాసిని (ఒక ధార్మికుని విల్లునుదచ్చరిత్రయు, తేలిక శైలి పద్యకావ్యము)
0-8-0 ఆంధ్రీకృతాష్టావక్రగీతలు (వేదాంతసారసంగ్రహము, శ్లోకములును గీతములును)
0-8-0 యాదవాద్రీశోపాఖ్యానము (బీబీనాంచారు పెండ్లికథ, మిక్కిలి తేలికశైలి)
0-8-0 ప్రసంగవచన హరిశ్చంద్రనాటకము (జాతీయములుగలది, క్రొత్తఅచ్చు)
0-6-0 స్త్రీలమీటింగు నాటిహరికథ (జగత్ప్రసిద్ధము, కొద్దిప్రతులేయున్నవి)
0-6-0 సోమేశ్వరీయము (వివిధవృత్తములు చిత్రకవిత్వముఁగల చాటుప్రబంధము)
0-6-0 మాహేంద్రపురాణము (మాసివాయనములనోముకథ, చిన్నప్రబంధము)
5-0 అద్భుతోత్తరరామాయణ తృతీయాశ్వాసము (1911 సం॥ B. A. టెక్స్టు)
-0 వేమనయోగీంద్రచరిత్రము (చిత్రపటములుగల తేటతెలుగు వచనకావ్యము)
-0 అంకజ్యోత్స్న (700 యుక్తి లెక్కలుగలది, బహుప్రసిద్ధమైనది)
5-0 ప్రైమరీ పరీక్ష లెక్కల పుస్తకము (48 ఎగ్జామినేషన్ పేపర్సుగలది)
-3-0 అజ్ఞానధ్వంసిని (మాతాపితృదివర్ణనము, దేవతాప్రార్థనముఁగలది)
0-3-0 చెన్నపురి రాజధాని భూగోళము (జిల్లాలమార్పునకు దర్మిలాది)
0-2-0 సౌఖ్యవిషయగుచ్ఛము (బహుప్రసిద్ధమైనసంగ్రహపు హైజీను)
0-2-0 చిన్నతరగతుల లెక్కలపుస్తకము (అంకజ్యోత్స్న 1 వ భాగము)
0-2-0 అక్షరాభ్యాసము (అక్షరములును గుణితమును వేగముగ రావీలైనది)
0-2-0 ముక్తికాంతామణీశతకము (ప్రార్థనాశ్లోకములును లోకోక్తులుగలపద్యములును)
0-2-0 సర్వమతభక్తానుకూలకీర్తనావళి (చక్కనిపంతమట్లుగలది, క్రొత్తపద్ధతి)
0-1-0 కీర్తనలు, హారతులు, పాటలు (పాడుకొనుటకు పాఠాంతరములుఁగలవు)
0-1-0 మనోహరసోమేశ్వరశతకము (108 పసందైన సీసపద్యములుగలది)
1-0 పూర్వకర్మశతకము (రామాయణభారతాది గ్రంథాంశములు, చూచితీరవలెను)
-0 జార్జిప్రభు పట్టాభిషేకము (వివిధవృత్తవిలసితము)

చిరునామా. { నాదెళ్ల పురుషోత్తముడు.
మచిలీపట్టణము.